# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

**3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.**

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

**3 ఔ॥ రు. 3-10  6 ఔ॥ రు. 5-50**

## క్షీరబలాతైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

**6 ఔ॥ల బుడ్డి రు. 3-0**

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

**బుడ్డి రు. 2-0**

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

**బుడ్డి రు. 4-0**

# కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.**

ఆంధ్ర ప్రదేశ్, మైసూరుకు ఏజంట్లు :

**శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు, బెంగుళూరు**




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# కుల, మత, వర్గ బేధాలు అనర్ధదాయకం!



పూర్వం కులాలు వృత్తులనుబట్టి ఏర్పడినవి. జాతీయ బాధ్యతలను, బరువు భారములను స్వీయ శ్రేయస్సు దృష్ట్యా పంచుకొని నిర్వహించకలుగడం ఆ నాటి ఉద్దేశం. వృత్తులను సయితము క్రమబద్ధంగా, జాతీయ లక్ష్యాల కనుగుణంగా స్వీయ శ్రేయోసౌభాగ్యాలనుద్దేశించి నిర్వహించడానికి ఆచారాలు, సాంప్రదాయాలు ఏర్పడినవి. ఈ నాడు పరిస్థితులు మారడంతో బాటు ప్రజల మనస్తత్వాలుకూడా మారినవి. కులాలననుసరించి వృత్తులు స్వీకరించే సాంప్రదాయం మరుగుపడిపోయినది. దాంతో ఆ నాటి ఆచారవ్యవహారాల, సాంప్రదాయాల విశిష్టత విస్మరించబడి అభివృద్ధి అభ్యుదయాల పేరుతో ఆధునికవాదానికి ప్రజలు మొగ్గుచూపుచున్నారు. ఈ పరిస్థితులలో వృత్తులదృష్ట్యా కులాల ప్రాధాన్యత తగ్గిపోయినా యింకా స్వార్ధపూరితమైన స్వీయ

ఆదర్శలక్ష్యాల సాధనకు కులాలను వినియోగించుకోడానికి ప్రజలు ప్రయత్నించడం ఆత్మవంచనే కాకుండా జాతీయతకే ద్రోహము తలపెట్టినట్లు.

ఇక మతములను పారజూచినచో, ప్రతియొక్క మతము మానవుని జీవయాత్ర వికాసవంతంగా చేసికోవడానికి ఏర్పడినదని తెలిసికొనతగినది. అంటే మానవ జీవయాత్ర ధర్మమునకు, న్యాయమునకు బద్ధమై, సత్యమార్గాన్ని అనుసరించి తోడ్పడునవి మతములు. నీతినియమాలతో, నియమబద్ధమైన జీవితమును శాంతిభద్రతల వాతావరణంలో గడుపగలుగాలనేది మతముల ఉద్దేశము. కాబట్టే మతములన్నియు సత్యము, ప్రేమ, పరోపకార, పారమార్థికచింతలను, పరస్పరసద్భావ, సానుభూతి, సహకారములను ప్రబోధిస్తూ, ప్రజలలో ఆత్మవిశ్వాసమును పెంపుజేయుటకు ఏర్పడినవి. ఇవే మానవ శ్రేయస్సుకు మూలాధారములు. ఇవే లోక కారకుడు, సర్వాంతర్యామి, సర్వశక్తి సమన్వితుడు, సత్యస్వరూపుడు అగు భగవంతుని గుర్తించి, ఆయనకంకితమై యిహపరాలలో సుఖపడడానికి తోడ్పడునవి. వానిని లక్ష్యము చేయనివాడు ఏమతానికి చెందినవాడైనా, తను, తనమతం ఎంతగొప్పదని విర్రవీగినా, లేదా యితరమతములను చిన్నచూపుచూచినా అది అపోహమాత్రమే కాక విద్రోహంకూడాను.

ప్రపంచమతము లన్నిటిలోను హిందూమతము, దాని ధర్మాలు విశాల, ఉదార స్వభావముగలవి. శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలోను, వేదములు, ఉపనిషదులు మానవ జీవయాత్ర కష్టములకు, దుఃఖములకు, జటిలసమస్యలకు గురికాకుండా ప్రపంచ కళ్యాణం రూపొందుట కనువుగా ప్రబోధించి ఆత్మవిశ్వాసాన్ని పూరించడం జరిగినది. సత్య, ధర్మాల స్వరూపాన్ని వివరిస్తూ దివ్యజీవనానికి అనుసరించదగు మార్గాలు సూచించబడినవి. ప్రేమ, సానుభూతి, ఓర్పు జీవయాత్ర క్రమబద్ధంగాను రూపొందడానికి అవసరమని, అహంకారము, మమకారము పరిమితము చేసికొనగలిగినప్పుడే పరమాత్మ ప్రీతికి పాత్రుడై లోకశ్రేయస్సుకు తోడ్పడకలుగుతాడనేది హిందూమత సారాంశము. మహమ్మదు నబి సయితము ఆనాడు తన చుట్టూయుండిన ప్రజల అజ్ఞానాన్ని, అమానుషత్వాన్ని, అరాజకాన్ని రూపుమాపి నీతినియమాలతో కూడిన సత్యమార్గాన్ని చూపడానికి పూనుకున్నాడు. ప్రజల స్థితిగతులు మెరుగు కావడానికి ఆనాటి పరిస్థితులలో తన బోధనలు తప్ప మరొక మార్గం కనుపించలేదు కాబట్టి ప్రజలను తన మతమొక్కటే ఉద్ధరించగలదని ప్రబోధించవలసి వచ్చినది. అలాగే ఏసుక్రీస్తు, గౌతమబుద్ధుడు అజ్ఞానంతో, అహంకారంతో మంచిచెడ్డలను గుర్తించలేని స్థితిలోనున్న మానవులకు తమ మతములద్వారా వెలుగుబాట చూపించి జ్ఞానమును ప్రసాదించి, సత్యం, ప్రేమ, అహింస, సత్శీలముల విశిష్టతను పరస్పరసద్భావ, సానుభూతి, సహాయముల ఆవశ్యకతను; క్షమ, సేవ, త్యాగాలు తస్వీయ ఉద్ధరణకు వినియోగపడు మార్గములను సూచించారు. ఇలాగే మతకర్తలందరు అహంను, స్వార్థమును పరిమితం

(523వ - పేజీ చూడుడు)

# మర్మగుహ

శ్రీ సి. సి. పున్నయ్య



(గతసంచిక తరువాయి)

ఇన్స్:- నేను చెప్పబోయేదాన్ని బాగా విను. బ్యాంకిలో దొంగతనం చేసినవాడు రాజయ్య అని నా నమ్మకం. అందుకు నీ సాక్ష్యం కావాలి!

రాఘు:- మీరు నిర్ణయించిన తరువాత యిక నా సాక్ష్యం, సలహా ఎందుకు?

ఇన్స్:- అది నిజమే - నీ సాక్ష్యం కోర్టులో నా నిర్ణయాన్ని బలపరచాలి.

రాఘు:- నేను కండ్లతో చూడనిదానిని చూచానని ఎలాగ చెప్పేది?

అలా నేనబద్ధం ఆడలేను. ధర్మమునకు, న్యాయమునకు విరుద్ధంగా అబద్ధమాడమని మీరు నన్ను కోరడం సబబనిపించుకోదు. సామాన్య ప్రజలకు న్యాయం కలిగించి రక్షణ నీయవలసిన ఉద్యోగం మీది. నీతినియమాల ననుసరించి నడచుచున్నారా లేదాయని చూచి అవి తప్పినవారిని శిక్షించవలసిన మీరిలా నన్ను బలవంతపెట్టడం ధర్మంకాదు.

ఇన్స్:- రాఘువులూ! నిన్ను న్యాయం, ధర్మం అడుగరాలేదు. నీవు నా స్నేహితుడవని సహాయం కోరవచ్చాను. నా కనుకూలముగా నీవు సాక్ష్యం చెప్పితీరాలి. ఈ సాక్ష్యంవలన నీవు నష్టపడేది ఏమిలేదు సరిగదా నాకు మాత్రం ప్రమోషన్ వస్తుంది.

రాఘు:- మీ ప్రమోషన్ కుగాను ఒక బీదవానికి నేనబద్ధమాడి ద్రోహం చెయ్యమనా మీరు బోధించడం! నా సాక్ష్యం సత్యాన్ని బయలుపరచేదానికి బదులు మరుగుపరచినవాడిని కానా?

ఇన్స్:- అది నేను చూచుకొంటాను. టైమయింది _ నేను వెళుతున్నాను. కోర్టుకు తప్పక రావాలి!

రాఘు:- రాజయ్య జీవితానికి నేను యమకింకరుడను కావాలి - అదేకదూ మీకు కావలసింది! చేయ కలిగితే బీదసాదలకు సహాయంచేయాలి కాని తప్పుడు సాక్ష్యంతోటి రాజయ్యను చెరసాలపాలు చేయడం మన ఉభయులకు క్షేమకరం కాదేమో! బీదవారి ఉసురు కారుచిచ్చులాంటిది.

ఇన్స్:_ నీవు చేయవలసింది స్నేహితధర్మంగా మాత్రం.

రాఘు:- ఇన్స్పెక్టరుగారు బాగా చెప్పారు! ఏది ధర్మం? అమాయకుడు, నిరపరాధి అయిన రాజయ్యను తప్పుడు సాక్ష్యంతో చెరసాలపాలు చేయడమా?

ఇన్స్:_ ఇంతకూ నీవనేది ఏమిటి?

రాఘు:_ మీకు తెలియనిదేమున్నదండీ? రాజయ్యను నిరపరాధిగా విడుదలచేయించ పూనుకోవాలని.

ఇన్స్:_ రాఘువులూ! నీవిక నీతులు నాకు చెప్పవద్దు. నేను నీ దగ్గరకెందుకు వచ్చానో తెలుసా?

రాఘు:_ తెలుసు. నన్ను తీసికొనివెళ్ళి తప్పుడు సాక్ష్యం చెప్పించి నిరపరాధియైన రాజయ్యను జైలుకి పంపడానికి పూనుకొని - కాని వాని కన్నీరు మనలను సర్వనాశనం చేస్తుంది. ఒకడిని చెరచి మరొకడు ఎన్నడు బాగుపడడు.

ఇన్స్:-(కటువుగా) నీ ఉపన్యాసం యింక చాలించు! నే నీ యిప్పటి ఉద్యోగహోదాలో నిన్ను యితరులను కూడ ఎంత పనైనా చేయగలనని జ్ఞాపకముంచుకో! భవిష్యత్తును ఆలోచించుకో! నాకు ప్రమోషన్ వస్తే నేను, నా కుటుంబము సుఖపడటంతోబాటు మన యిద్దరి స్నేహం నీ కుపయోగపడగలదు. లేదా నీవు ఏదోవిధంగా, ఎప్పుడో కప్పుడు నా చేతిలో చిక్కక తప్పదు. తర్వాత నీ యిష్టం!

(ఇన్స్పెక్టరు లేచి వెళ్లిపోవును. రాఘవులు విచారవదనంతో కుప్పకూలియుండును.)

♦ ♦ ♦

(జమీందారు భవనము. శివప్రసాద్ ఏదో పుస్తకము చదువుకుంటూ సోఫాలో కూర్చొనియుంటాడు. రాగయ్య గబగబ వచ్చి) -

రాగయ్య:_చిన్న బాబూ ! చిన్న బాబూ ! (ఎగాదిగా చూచి) సరేలే...

శివప్రసాద్:-ఏం రాగయ్యా !

రాగ:-బాబుగారు స్వప్నావస్థలో నున్నట్లున్నది !

శివ:-అబ్బ ! కలలో... అపరూపసుందరి...తిరుగుతుండింది. ఆమెను పట్టుకోదలచి ప్రియుడు పరుగెత్తినాగాడు.

రాగ:_ఎక్కడ...అడవిలోనే కదా !

శివ:_అవును - నీవుకూడ యీ పుస్తకం చదివినట్లున్నావే !

రాగ:_ఈ లోకంలో నేను చదవని పుస్తకమంటూ యుంటేగా ! అదిసరే... నేనొకటి చెప్పవస్తే మీరు మరొక యూహాప్రపంచంలో నున్నారు.

శివ:_ఏమిటది ? (చీకాకుగా)

రాగ:_అడవిలో జింకలు విస్తారంగా నుంటవట. మీ నాన్నగారు వేటకువెళ్ళి ఒక జింకను పట్టుక రమ్మని మీతో చెప్పమన్నారు.

శివ:_సరే -

రాగ:_సరేలేదు గిరేలేదు - పదండి పోదాం !

(జమీందారుగారు మెల్లగా లోపలికి వస్తారు)

జ:-ఏమిటి రాగయ్యా ! ఎక్కడికో బయలుదేరమంటున్నావు ?

రాగ:_ఎక్కడికిలేదు బాబుగారూ ! _ చిన్న బాబుగారు వేటకు బయలుదేరుతున్నారు.

జ:_వేటకా ! - జాగ్రత్త ! పులులలాంటి క్రూరమృగాలుంటవి.

రాగ:-అవేంచేస్తవి మనల్ని ? మమ్మల్ని చూస్తే అవి హడలి పారిపోతవి. (అంటూ తుపాకి చూపిస్తాడు)

శివ:-ఇక్కడే ఎవరినైనా తుపాకి పేల్చి చంపేవు !

రాగ:-అలా ఎందుకు జరుగుతుంది బాబుగారూ !

జ:_చినబాబూ ! తిరిగి వచ్చేటప్పుడు మంచి జింకనొకదానిని పట్టుకొని రా.

శి:-అలాగే - తప్పకుండా నాన్నగారూ !

జ:-పోతున్నది అడవికి _ మెలకువగా వెళ్లిరాండి !

రాగ:-అందుకనే చిన్న బాబుగారికి తోడుగా నేను వెళుతున్నాను.

జ:-రాగయ్యా ! జింక - జ్ఞాపకముండనియ్యి !

రాగ:-మీరు చెప్పాక జింకను తేవడం మరుస్తానా ?

జ:-అదిసరే - చిన్న బాబును...

రాగ:-మీరు భయపడకు బాబుగారూ ! నేనుండగా !

శి:-నాన్న గారూ ! రేపు ఉదయం బయలుదేరి వెళ్ళటం.

రాగ:-ఏమిటి బాబూ ! నేను లేకుండా నా-పప్పులేని పెళ్లిలాగ !

శి:_సరేలేవోయ్ !

జ:-చిన్న బాబూ ! వేటకు బయలుదేరి పోయేముందు మీ అమ్మను తలచుకొని పో నాయనా !

శి:_అలాగేలే నాన్నగారూ !

జ:_వల్లీ ! చిన్న బాబూ, రాగయ్య రేపు ఉదయం వేటకు బయలుదేరి వెళుతున్నారు. వాళ్లకు కావలసిన వసతులన్నీ అమర్చిపెట్టు.

వల్లి:-(తలుపు చాటుననున్న వల్లి ముందుకువచ్చి) అలాగే బాబుగారూ !

◆ ◆ ◆

(న్యాయస్థానంలో రాజయ్యపై నేరము విచారణలో నుంటుంది. రాజయ్య బోనులో నిలబడియుండగా ప్రక్కన పోలీసులు నిలబడియుంటారు. అంతా నిశ్శబ్దంగా నుంటుంది.)

న్యాయమూర్తి:-రాజయ్య లక్ష్మీ బ్యాంకులో దొంగిలించాడన్న నేరం నిర్ధారణ చేయడానికి అనువైన సాక్ష్యం యింతవరకు లభించలేదు. మరల విచారణ చేయవలసియున్నది.

(బ్యాంకి మేనేజరును కోర్టులో న్యాయమూర్తి ముందు హాజరుపెడతారు.)

ప్రభుత్వ న్యాయవాది:-మీరు లక్ష్మీ బ్యాంకు మేనేజరుగారా ! మీ పేరు ?

బ్యాంకి మేనేజరు:_అవును సార్ ! నా పేరు వి. యస్. స్వామి.

ప్ర. న్యా:-(రాజయ్యను చూపిస్తూ) ఇతనిని మీ రెరుగుదురా ?

బ్యా. మే:-ఎరుగుదును - రెండు రోజుల క్రితం మా ఆఫీసులో ఏదైనా ఉద్యోగం యిప్పించమని కోరుతూ వచ్చాడు. ఏమి అవకాశంలేదని చెప్పి పంపాను. తర్వాత సాయంకాలము బ్యాంకి గేటు దగ్గరే కూర్చొనియుండినట్లు మా జవాన్ చెప్పాడు.

ప్ర. న్యా:-ఎక్కడ యున్నట్లు ?

బా. మే:_మెయిన్ గేటు దగ్గర.

ప్ర. న్యా:_మీరు చూశారా ?

బ్యా. మే:-లేదు. మా బంట్రోతు చెప్పినమాట.

ప్ర. న్యా:-మీరు మొదట చూచినప్పుడు అతనిని గురించి ఏమి అభిప్రాయపడ్డారు?

బ్యా. మే:-బీదవాడు - మంచివాడని సానుభూతి ప్రకటించాను.

ప్ర. న్యా:_అటువంటివాడు మీ బ్యాంకిలో డబ్బు దోచియుంటాడని నీవు నమ్ముతున్నావా?

బ్యా. మే:-మరునాడుదయం ఇనుపపెట్టె తాళం విరిగిపోయి తలుపు తెరువబడియుంది. అందులోది పదివేల రూపాయలు దొంగిలించబడినవి.

ప్ర. న్యా:_అందుకని!

బ్యా. మే:_రాజయ్య దొంగిలించియుంటాడని అనుమానం.

ప్ర. న్యా:-మీరు మరునాడుదయం చూచినప్పుడు డబ్బు లేదుకదా - మీరు పోలీసు రిపోర్టయినా చేయలేదేం?

బ్యా. మే:_లేదు. ఇనుపపెట్టెలో డబ్బులేకపోయేసరికి పోలీసు స్టేషనుకు టెలిఫోను చేశాను. ఇన్స్పెక్టరుగారు దొంగ డబ్బుతో కూడా పట్టుపడ్డాడని చెప్పారు.

ప్ర. న్యా:-దొంగిలించినప్పుడో, దొంగిలించుకొని పారిపోయేటప్పుడో మీరు చూడలేదు, పట్టుకోలేదు కదూ?

బ్యా. మే:-లేదు _

ప్ర. న్యా:-(న్యాయమూర్తి నుద్దేశించి) ప్రభువులు చిత్తగించాలి! బ్యాంకు మేనేజరు చెప్పినదానిని బట్టి రాజయ్య దోషి కాడేమోననిపిస్తున్నది. ఇతర సాక్షులను విచారించవలసియున్నది.

న్యా:-అలాగే - తర్వాత.

(కోర్టు బంట్రోతు కోటయ్యను పిలిచి హాజరు పెడతాడు.)

ప్ర. న్యా:-(రాజయ్యను చూపిస్తూ) ఈయన నీకు తెలుసా?

కోటయ్య:-తెలుసు.

ప్ర. న్యా:_ఎంత కాలమునుండి?

కోట:_ఇప్పుడే తెలుసు. దొంగతనం జరిగిన రాత్రే చూచాను. బ్యాంకిలో దొంగిలించుకొని పారిపోవ ప్రయత్నిస్తుండగా -

ప్ర. న్యా:-రాజయ్య దొంగిలించాడని నీకు బాగా తెలుసా?

కోట:_అవునండీ! పారిపోయేవాడిని నేనే పట్టుకున్నాను.

ప్ర. న్యా:_అప్పుడు టైము ఎంత అయియుంటుంది?

కోట:_షుమారు రాత్రి 12 గంటలుంటుంది.

ప్ర. న్యా:-ఆ సమయంలో నీవక్కడికి రావడానికి కారణం?

కోట:_అప్పుడే నేను ఆ దారిన యింటికి వెళుతున్నాను.

ప్ర. న్యా:-భలే సమాధానం! దారిన వెళుతున్న నీవు రాజయ్య బ్యాంకిలో దొంగతనం చేస్తున్నాడని ఎలా యూహించావు?

కోట:-డబ్బు సంచితోసహా పట్టుకున్నానండీ అతనిని.

ప్ర. న్యా:_ఎక్కడ?

కోట:_రోడ్డుమీద - బ్యాంకి గేటుకు సమీపంగా.

ప్ర. న్యా:-ఇనుపపెట్టె పగులగొట్టి దోచినప్పుడు పట్టుకోలేదు కదూ!

కోట:-లేదు.

ప్ర. న్యా:-రాజయ్యను పట్టుకునేందుకు అతను దొంగయని, అతని దగ్గర డబ్బుసంచి యున్నదని ఏలా యూహించగలిగావు?

కోట:-నేను దారిన నడిచి వెళుతుంటే (రాజయ్యను చూపిస్తూ) యీయన నక్కినక్కి గేటు దగ్గరకు ...... రాసాగాడు. నేను అనుమానపడి అతనిని సమీపించి, 'ఎవరు నీవు?' అని అడిగాను. బదులు చెప్పకపోయేసరికి మరింత దగ్గరకు పోయి అతని చేతిలోనున్న సంచిని చూశాను. వెంటనే నేను అతనిని పట్టుకొని దొంగ! దొంగ! అని అరిచాను. తర్వాత అది డబ్బుసంచి యని తెలిసింది.

ప్ర. న్యా:_అతను నిజంగా దొంగయియుంటే నిన్ను చూడంగానే పరుగెత్తిపోవడానికి ప్రయత్నించియుండాలి కదా?

కోట.-అవును.

ప్ర. న్యా:-అతనలా చేయకపోవడంవలన దొంగయియుండడనిపిస్తున్నది. నీవేమంటావు?

కోట:_దొంగిలించినది నేను చూడలేదు కాని నేను పట్టుకొన్నప్పుడు డబ్బుసంచి అతని చేతిలోనున్నది.

ప్ర. న్యా:-అయితే నిజంగా నీవతనిని పట్టుకున్నావు కదూ?

కోట:-అవును. పోలీసులకు ఒప్పగించాను.

ప్ర. న్యా:_ఏ పోలీసుకు?

కోట:_నెం. 214 వ.

ప్ర. న్యా:-ఇప్పటివరకు జరిగిన విచారణలో సాక్ష్యం అవకతవకలుగా నున్నదని తోస్తున్నది. కోర్టువారు పారమాడాలి!

(నెం. 214 పోలీసును హాజరుపెడతారు.)

ప్ర. న్యా:-(పోలీసుతో) రాజయ్య దొంగేనా?
పో:-అవును.
ప్ర. న్యా:-దొంగతనం జరిగినరాత్రి మీరతనిని ఎక్కడ పట్టుకున్నారు?
పో:-బ్యాంకి మెయిన్ గేటు దగ్గరగా రోడ్డుమీద - నేను వచ్చేటప్పటికి జనం గుమికూడియున్నారు. వారంతా రాజయ్య దొంగ యన్నారు. అతని చేతిలో డబ్బుసంచి పట్టుబడింది.
న్యాయమూర్తి:-సరే - ముద్దాయిని విచారించండి.
ప్ర. న్యా:-నీ పేరు?
రాజయ్య:-రాజయ్య.
ప్ర. న్యా:-నీ జీవనం?
రాజ:-రెక్కల కష్టం.
ప్ర. న్యా:-ఎక్కడ?
రాజ:-కూలి, నాలి ఎక్కడ దొరికితే అక్కడ.
ప్ర. న్యా:-ఈ దొంగతనాన్ని గురించి నీవేమి చెప్తావు?
రాజ:-నేను చెప్పవలసిందేమున్నది?
ప్ర. న్యా:-అంటే - అసలీ డబ్బుసంచి నీ చేతుల్లోకి ఎలా వచ్చింది?
రాజ:-విధివైపరీత్యం.
ప్ర. న్యా:-అయితే నీవు దొంగిలించినది కాదా?
రాజ:-దొంగిలించి పారిపోతున్నవానిని పట్టుకో బోయి నేను దొంగనైనాను.
ప్ర. న్యా:-దొంగిలించినవానిని ఆనవాలు పట్టగలవా?
రాజ:-ఆ కటికచీకట్లో మనిషిని గుర్తించలేక పోయాను.
ప్ర. న్యా:-కోర్టువారి ఎదుట యితడు యదార్థమును మరుగుపరచ ప్రయత్నిస్తున్నాడు. ఇతనే ముద్దాయిగా భావిస్తున్నాను.
న్యాయమూర్తి:-అవును - సాక్ష్యాధారాలను పరిశీలిస్తే రాజయ్య దొంగయని నిర్ణయించడానికి అవకాశాలు అంతగా కనుపించడంలేదు. దొంగిలించిన వాడెవ్వడూ 'దొంగ! దొంగ!' అని అరచి నలుగురిని చేర్చడు. రాజయ్యనే దొంగిలించాడని కాని, అతనిని దొంగిలించేటప్పుడు మేము పట్టుకున్నామనిగాని ఎవరూ చెప్పడం లేదు. కాబట్టి రాజయ్య దోషి యనేవాదం బలహీనంగా నున్నది. అయినా అతను నిర్దోషియనీ చెప్ప వీలుకాకున్నది. అందుకు కారణం అతను పట్టుబడినప్పుడు డబ్బుసంచి అతని చేతిలో నుండింది. తర్వాత విచారణ సందర్భమున నిర్దోషిత్వాన్ని అతడు ఋజువు చేసికోడానికి బదులు మౌనంగా యూరకున్నాడు. ఇవి అతనిని దోషిగా చిత్రిస్తున్నవి. రాజయ్య వాలకం అనుమానాస్పదంగా నుండడంచేత అతనిని దోషిగా నిర్ణయిస్తూ 3 సంవత్సరాల కారాగార శిక్ష విధిస్తున్నాను. అతని సత్ప్రవర్తనను శిక్షా కాలం రెండు సంవత్సరాలకు పరిమితం కావచ్చు.
రాజ:-కోర్టువారు నన్ను దోషిగా నిర్ణయించారు! అన్యాయం! అక్రమం! అయోగ్యులు, అవినీతి పరులు, దోపిడీగాండ్రతో నిండియున్న యీ ప్రపంచానికి నేనా దొంగను? న్యాయప్రభూ! నేను ముమ్మాటికి దొంగను కాను, దోషినికాను. నీతినియమాలు ఋజువై, ధర్మం, న్యాయం వర్ధిల్లాల్సిన యీ చోటు మీ నిర్ణయంవల్ల కలుషితమైంది...
పోలీసులు:-చాలించు వాగుడు! పద! పద! (అంటూ అతనిని బేడీలతో కోర్టు వెలుపలకు తీసికొని పోవుదురు.)

• • •

(వకీలు రాఘవరావుగారు కుర్చీలో కూర్చొని లక్ష్మీ బ్యాంకిలో జరిగిన దొంగతనాన్ని గురించి, కోర్టు తీర్పును గురించి చదువుతుంటాడు. ఇంతలో భార్య వస్తుంది.)
మహాలక్ష్మి:-ఏమండీ! సాయంకాలం కపాలేశ్వర దేవాలయంలో ఉత్సవముటండి. చాల బాగుంటుందిట - ఎక్కడెక్కడివాళ్లు చూడడానికి వస్తారుట.
రాఘవరావు:-సరేకాని పత్రికలో ఈ వార్త చూచావా! - మన మణి నాయన రాజ్యలక్ష్మి బ్యాంకిలో దోచేశాడట. పోలీసులచే పట్టుబడి కోర్టువారు మూడు సంవత్సరాలు జైలుశిక్ష విధించారు. దొంగవెధవ - ఇక ఒక్క నిముషం కూడ యీ పిల్ల మన యింట్లో నుండవీలులేదు.
మహా:-అదేమిటండీ! పాపం! పిల్ల ఏం చేసిందండీ! యిప్పుడు పొమ్మంటే మాత్రం ఎక్కడికి పోతుంది - యీడొచ్చిన పిల్ల కూడాను.
(సశేషము)

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



ఇతర వాదభేదము లెట్లుండినను, స్వయముగ నా అనుభవమునందు, రెండు గంటల కాలము ఉపన్యసించుటవలన నా దేహోష్ణత సహజస్థితికి పైన ఒక డిగ్రీ అధికమగుచున్నది.

శ్రు॥ నాసికే నిరభిద్యేతాం. నాసికాభ్యాం
ప్రాణః ప్రాణా ద్వాయుః.

[పిమ్మట నాసిక ఏర్పడెను. నాసికయందు ఘ్రాణశక్తి కలిగెను. ఘ్రాణశక్తివలన వాయువు కలిగెను.]

విరాట్పురుషుని నిర్మాణమున వాగింద్రియము కలిగిన వెనుక, నాసిక ఏర్పడెను. పిండ నిర్మాణమున ఇందు కనబడు వరుసక్రమమున్నదని పాశ్చాత్య వైద్యశాస్త్రము తెలుపుచున్నది. ఘ్రాణేంద్రియ గోళయమగు నాసిక మొదలేర్పడెను. పిమ్మదిగ ఘ్రాణశక్తి (ఇంద్రియము) వృద్ధిపొందెను. ఆ శక్తిని, పంచభూతములలో నొకటగు వాయువు అధిష్టించెను. పరిమళములు మనకు సోకుటకు వాయువు మధ్యవర్తిగ నున్నది. ఇంద్రియ విషయమగు పరిమళము, ఇంద్రియ గోళయమగు నాసికకు సోకుటకు వాయువు సహాయపడుచున్నది. గాలి వీచునపుడు గాలికి ఎదురుగ నిలచినచో, ఎదుటనుండు విషయముల పరిమళము మనకు సోకుచున్నది. కాని, వెనుకనుండు విషయముల గంధము మన అనుభవమునకు అందుటలేదు. కనుక వాయువు ఘ్రాణమునకు అధిష్టానదేవత. వాయువు యొక్క అనుగ్రహమువలన ఘ్రాణేంద్రియము వ్యవహరించుచున్నది.

శ్రు॥ అక్షిణీ నిరభిద్యేతా మక్షిభ్యాం
చక్షు శ్చక్షుష ఆదిత్యః

[నేత్రము లేర్పడెను. నేత్రములవలన చూపు కలిగెను. చూపువలన సూర్యుడు కలిగెను.]

విరాట్పురుషుని సృష్టియందు, పిండరూపమున, నోరు, నాసిక ఏర్పడెను. పిమ్మట నేత్రముల జత కలిగెను. అనగా కంటి గోళయములు కలిగెను. కండ్లయందు దృష్టి కలిగెను. ఆ దృష్టికి సూర్యుడధిష్టాన దేవత యాయెను.

ఇవి అవివేక పలుకులు కావు. ఈ వర్ణక్రమమున తర్కన్యాయము, శాస్త్రరీతి, సమాధానము కూడి యున్నదని విచారమువలన, పూర్వపరిచయమువలన తెలియుచున్నది. మన దృష్టి చక్కగ నుండినను, విషయములు ఎదుట యుండినను, విషయములు ప్రకాశమువలన అనుగ్రహింపబడక పోయినచో, వాటిని మనము చూడజాలము. దృష్టి వ్యవహారము, ప్రకాశముండిననే, అనుభవమునకు వచ్చును. చీకటియందు మనమందరము గ్రుడ్డివారమగుచున్నాము. సూర్యుడు సర్వప్రకాశములకు కేంద్రము. ఆదిత్యుడనగా సూర్యునియందలి ప్రకాశము.

విరాట్పురుషుని నేత్రశక్తివలన సూర్యుడు కలిగెననుట ఉపనిషద్వాక్యములకు తగియున్నది. సూర్యుడు తన ప్రకాశమును వ్యాపింపజేసి, విషయరాసులను, వర్ణములను, రూపములను చూచుభాగ్యము కలిగించుచున్నాడు. సూర్యుడు లేకున్న, దృష్టి లోపించును. అంధకారము ప్రపంచమును కప్పుకొనును. అపుడు, నాసిక కిరుప్రక్కలనుండు నేత్రగోళయము లుపయోగము లేకపోవును. కనక నేత్రములకు ఆదిత్యుడధిష్టాన దేవత యనుట శాస్త్రసమ్మతముగ నున్నది.

శ్రు॥ కర్ణౌ నిరభిద్యేతాం కర్ణాభ్యాం
శ్రోత్రం శ్రోత్రా ద్దిశః.

[చెవులేర్పడెను. చెవులవలన శ్రవణశక్తి కలిగెను. శ్రవణమువలన దిశ లేర్పడెను.]

క్రమముగ నేత్రము లేర్పడిన వెనుక, శ్రోత్రేంద్రియ గోళయము లేర్పడెను. ఆ గోళయములనుండి శ్రోత్రేంద్రియము (శ్రవణశక్తి) కలిగెను. వానినుండి

అధిష్టానదేవతయగు దిశలేర్పడెను. తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము, పైవైపు, క్రిందివైపు గల దిక్కులెల్ల ఆకాశము. ఆకాశము లేకున్న దిశలు లేవు. కనుక దిశలనగా ఆకాశమని భావము.

శ్రవణశక్తికి ఆకాశము అధిష్టానదేవత. అనగా, శ్రవణమునకు విషయము శబ్దము. ఆకాశము లేక శబ్దము వ్యాపింపజాలదు. శబ్దము కలుగుటకు కూడ ఆకాశముండవలెను. ఆకాశమున వాయుతరంగము లుండుట వలన, శబ్దము తరంగములై తేలిపోవుచున్నవి. ఆకాశము లేనిచో, వాయువు లేదు. శబ్దము వ్యాపించదు. కనుక శబ్దము కలుగుటకు ఆకాశము ముఖ్యాంశముగ నున్నది. శబ్దము లేకున్న, శ్రవణ గోళయముల నిర్మాణము వ్యర్థమగును. సాభిపతి యవి నిరుపయోగములై యుండును.

శ్రు॥ త్వక్ నిరభిద్యత. త్వచో లోమాని, లోమభ్యో ఓషధి వనస్పతయోః.

[చర్మము ఏర్పడెను. చర్మమునుండి రోమములు కలిగెను. రోమములనుండి ఓషధులు, వృక్షములు కలిగెను.]

విరాట్పురుషుని. విగ్రహమును పూర్తిగ మూయుటకు చక్కని చర్మమేర్పడెను. చర్మమునుండి రోమములు కలిగెను. విరాట్పురుషుని నిర్మాణము పూర్తి యాయెను. విగ్రహమును చర్మము మూసుకొనెను, ఆ చర్మము స్పర్శేంద్రియ మాయెను. అందు రోమములు కలిగెను. మానవశరీరమున రోమములు కలవు. ప్రపంచరూపమున ఓషధులు, వృక్షములు ఏర్పడెను. అనగా, వృక్షసముదాయ మెల్ల చేరినవని తెలుపుటకు ఓషధులని చేర్చబడెను.

శరీరముపై రోమములు పెరుగుటకు వ్యక్తి ప్రయత్నములు, పన్నగములు చేయనవసరము లేదు. అవి స్వాభావికముగ, తమంత తవియే పెరుగుచున్నవి. అదేవిధముగ, మూగజాతికి చేరిన వృక్షసముదాయములు, చలించక, మాట్లాడకపోయినను, భూమినుండి ఎట్టి ప్రోద్బలము లేకనే, పెరుగుచున్నది. ఇందుగల సామ్యము పరిపూర్ణము, అసదృశమైయున్నది. ఇట్టి శృంగార వర్ణనలవలన కలుగు ఆనందము వర్ణనాతీతము.

శ్రు॥ హృదయం నిరభిద్యత, హృదయాన్మనో, మనస శ్చంద్రమాః.

[హృదయము కలిగెను. హృదయమునుండి మనసు కలిగెను. మనసునుండి చంద్రుడు కలిగెను.]

క్రమప్రకారము హృదయనిర్మాణము తెలుపబడుచున్నది. అనగా, ఆలోచనలు, ఆవేశములు, దయ, ప్రేమ, విచక్షణ, సంకల్పములు తృప్తిపొందు కరణము, కేంద్రము అగు హృదయ మేర్పడెను. నేత్రములు దృశ్యేంద్రియమునకు గోళయములగునట్లు హృదయము ఒక గోళయము. అందుండి అనుభవములు పొందు ఇంద్రియము నిర్మాణమాయెను. దానిపేరు మనసు. మనసునకు చంద్రుడధిష్టానదేవత.

మనసునుండి చంద్రుడు కలిగెను అనుట విపరీతముగ తోచును. మానవుని మానసిక వ్యవహారములను శాస్త్రీకరించి, విచారించు శాస్త్రపరిశోధకులు, మానవుని మనసునకు, చంద్రునకు సన్నిహిత సంబంధమున్నదని సమ్మతించియున్నారు. కాముకుల ఉద్రేకములు, శృంగారరసములు, చంద్రకళలవలన బాధింపబడుచున్నవి. ఆంగ్లమున 'హనీమూన్' (Honey-moon) అనుపదము, మానవుని కామోద్రేక చేష్టలకు, వెన్నెల రాత్రులకు గల సంబంధము ననుసరించి నిర్మింపబడినదా యని యూహింపదగియున్నది.

ఉన్మత్తుల చికిత్సాలయములందుండు వైద్యులు, పౌర్ణమినాడు, తమ రక్షణయందుండు ఉన్మాదులను నిర్బంధమునయుంచుట కష్టసాధ్యమగుచున్నదని ప్రకటించియున్నారు. ఇతర దినములకన్న, పూర్ణిమ రాత్రులందు తగిలిన గాయములు విశేషముగ రక్తము స్రవించుట గమనించుచున్నాము. ఇందువలన చంద్రునికి, మనసునకు గల సంబంధము స్పష్టమగుచున్నది. మనసునకు అధిష్టానదేవత చంద్రుడు అను ఋషి వాక్యములు యదార్థములుగ నున్నవి.

మరియు సంస్కృతమున మతియను పదము చంద్రునకు, మనసునకు కూడ అన్వయించుచున్నది. అందువలన, వ్యష్టియందలి మనసే, సమష్టియందు చంద్రుడని తెలియవలెను.

(సశేషము)

# త్రాగుబోతు

జర్మను మూలం :
హాన్స్ ఫల్లాడా

ఆంధ్రానుసరణ :
డాక్టరు వి. ఎస్. శర్మ



గడచిన కథాభాగం

[సామ్మర్, ఆయన భార్య మాగ్డా ఆ వూళ్ళో పేరుప్రతిష్టలు గాంచిన వ్యాపార సంస్థకి యజమానులు. వాళ్ల రథం చాలా రోజులు ప్రశాంతం గానే కదలిపోయింది కాని అమాంతంగా ఒకరోజున ఆగిపోయింది. కంపెని పరిస్థితులు తారుమారయ్యాయి. వీటికన్నింటికి కారణం యజమాని సామ్మర్. ఆ ఆందోళనను కప్పిపుచ్చటానికి త్రాగటానికి ప్రారంభించాడు. భార్యకి ప్రారంభంలో ఈ సంగతి తెలియదు. తెలిసిన తర్వాత నయాన భయాన ప్రయత్నించింది సామ్మర్‌ని ఆ దోవనుంచి తప్పించటానికి. అది కొంతకాలానికి వాళ్ల ఇంటికే ముసలంగా పరిణమించింది. దాంతో హోరాహోరిగా భార్యాభర్తల మధ్య యుద్ధం. దానికాగలేక సామ్మర్ ఆ వూళ్లోనుంచి కాళ్లకి బుద్ధిచెప్పి బయటికి వచ్చాడు. తన కింత వరకూ ఆతిధ్యమిస్తూవున్న పల్లెటూరి హోటల్లో కాలక్షేపం చేస్తూ ఆ వుపద్రవాన్ని మరచిపోవచ్చనుకుంటూ తిన్నగా అక్కడికి చేరుకున్నాడు— ఇంక చదవండి.]

## I

నేను ఎవరో - ఎందుకా సమయాన్ని అక్కడ ప్రత్యక్షమయ్యానో హోటలావిడ చప్పున పసిగట్టింది. ఇంక ఆవిడ కంగారు చెప్పాలా! ఆ కంగారులో ఏం తట్టిందో "ఒక్క క్షణం ఆగండి. పనిమనిషిని పిలుస్తాను" అని అంటూ గబగబ మేడ మెట్ల దగ్గరికి నడిచింది. పైకేసి చూస్తూ "ఎలినార్! ఎలినార్! క్రిందికి చప్పున రావాలి..." అని గట్టిగా పిలవసాగింది.

"ఎలినార్" అనేమాట వినేటప్పటికి పోయిన ప్రాణం అమాంతంగా లేచివచ్చినట్లయింది. ఎలినార్ హోటలువాళ్ళ పనిమనిషి! అయినా నా అందాల రాణి ఆ పిల్ల! నన్నుచూస్తే ఎంత ప్రేమ! ఎంత భక్తి! దాంతో ఎంత భయం! ఆ పిల్ల చేతినించే పానీయాలని పుచ్చుకోవాలని, భోజనానికి కావాలసిన పదార్థాలని తెప్పించుకుని తినాలని అతిథులు ఈ హోటలికి రావటం పరిపాటి. అలాటివాళ్ళ కోరికలని తీర్చలేక సతమతమైపోతూవున్నా, నాకేవి రమ్మని సంజ్ఞ చేసినా, ఎంతనో ఆప్యాయంగా నా బల్ల దగ్గరికి వచ్చేది! నా భోజన మజ్జనాదులలో ఎంత శ్రద్ధ తీసుకుంటూ వుండేది! ఆ పిల్లని సంతోష పెట్టటానికి, నేను పుచ్చుకునే పానీయాలను రుచి చూడమని బలవంతం చేస్తూ వుండేవాణ్ణి! నా ప్రక్కనే కూర్చుని భోంచేయమని ప్రాధేయపడుతూ వుండేవాణ్ణి! అడపాదడపా మాలో మాట పేచీలు వస్తూవున్న నన్నెంతో మర్యాద చేస్తూ వుండేది...

మాగ్డా అలా తూలనాడి అవమానం చేసింది. వాళ్ళ లోకంలోనే తెగత్రెంపులు చేసుకుని ఇలా వచ్చేశాను. ఇది ఆపత్కాలం! ఇలాటి సమయంలో ఎలినార్ తప్ప మరెవళ్లు నాకు చేదోడువాదోడుగా నుండగలుగుతారు?... క్రిందటిసారి తప్పత్రాగేసి ఆ మైమరపులో ఏమేమో అన్నాను. ఆ పిల్లకి నా వైఖరి సుతరాం నచ్చిందికాదు. అదమాయిస్తూ ఈ పరిసరాలనుంచే తరిమి వేసింది... ఎలినార్ నా విషాద

గాథని ఇప్పుడు విన్నదా ఆ విచార సంఘటనని తప్పక మరిచిపోతుంది. నాకీ క్లిష్టసమయంలో అవసరమైన లాలనపాలనలని ఆ పిల్లే చూసుకుంటుంది... ఎలినార్ పేరుని వింటూ వున్నప్పటినుంచి నాలో రేకెత్తుతూ వున్న ఆలోచనలకి ఇంక అంతూ పంతూ అనేది ఎలా వుంటుంది ?...

పైన సందడిగా నుంది. బయట పనులు చూసుకోటానికి హోటలావిడకి ఒకరిద్దరు మగవాళ్లు వున్నా, లోపలిపనులు దిద్దుకోటానికి ఎలినార్ తప్ప మరె వ్వళ్లూ లేరు. ఎలినార్‌కి మేడమీదనే వుండటానికి గది నిచ్చారు. ఈ సమయంలో గదిలో విశ్రాంతి తీసుకుంటూవున్నా ఎలినార్ యజమానురాలు తనని పిలిచేటప్పటికి గబగబ పడుకున్న చోటినుంచి లేచివుండవచ్చు. కొంతసేపటికి దుస్తుల్ని సర్దుకుంటూ చకచక మెట్లని దిగి క్రిందికే వస్తూవున్నది. అలా వచ్చేమనిషి. తిన్నగా హాలులోకి రాకుండా ప్రక్కనే నున్న వంటగదిలోకి వెళ్ళింది. అక్కడ సామాన్లని సర్దుదూ వున్నది. చకచక పనిచేయటం అంటే ఎలినార్‌కి సరదా. ఇలాటి హోటలు అమ్మాయిలు ఈ ప్రాంతాల్లో కనబడటం సకృతి...

అంతా మెరుపుకి మల్లె జరిగిపోతున్నది. మరో క్షణంలో తలుపుని గభాలున తెరుస్తూ తిన్నగా నే నున్న చోటికే వచ్చింది ఎలినార్. హాలు దీపాలన్నీ ఇంకా వెలిగించలేదు. కొంచెం చీకటిగానే వుంది. అయితేనేం ఆ పిల్ల నాకేసి ఎగాదిగా చూస్తూ విస్తుపోతూన్నది. గాభరాతో జడని సర్దుకుంది. వేసుకున్న దుస్తులు చిందరవందరగా నున్నాయి. వాటిని చక్క చేసుకోటానికి శాయశక్తులా ప్రయత్నిస్తూ వుంది....

నన్ను గురుతు పట్టిందో లేదో నా ప్రక్కకే వచ్చి మందహాసంచేస్తూ, "ఇంకెవళ్ళో అనుకుని కంగారు పడుతూవున్నాను. మీరా ? ఎప్పుడు రావటం?" అని పలకరించింది. నా దుస్తులను తదేక దృష్టితో చూస్తూవుంది. అలా చూస్తూన్న సమయాన ఆ పిల్ల మనోప్రపంచం ఎలాటి తుపానులతో వత మతమైపోతోందో ఇంక చెప్పాలా ! .

ఆపుకోలేని వుద్వేగంతో, "మీరు ఇటుకేసి రారనుకున్నానే!... ఈ వాలకాన్ని చూస్తుంటే దివాలా తీసినట్లే కనబడుతున్నదే..." అని అంది ఎలినార్ తడబడుతూ.

"అంత లోతుకి ఇంకా దిగలేదులే." హుందాలో ఎలినార్ కేసి చూస్తూ జవాబిచ్చాను. ఆ సమయంలో నాలోకూడా లేగిపోతూవున్న విప్లవం ఇంతింతని ఎలా వివరించగలుగుతాను ? నా భార్యామణి మార్గాతత్త్వం వేరు. ఈ హోటలు పిల్ల ఎలినార్ తత్త్వం వేరు. ఎలినార్‌ది ఆర్ద్రతగల హృదయం. అంత కటువుగా కావాలని అలా అనలేదు. ఈ ఎగుడు దిగుళ్ళనుంచి నాకో తరుణోపాయం చూపే శక్తి ఈ పిల్లలో నున్నదనే రహస్యం నాకు బాగా తెలుసు. అంచేత ఏ సంగతీ కప్పిపుచ్చకుండా "మార్గా నామీద యుద్ధాన్ని ప్రకటించింది. నా ఆస్తిపాస్తుల్ని గుటకాయిస్వా చేయాలని ఎన్నెన్నో తంత్రాలని వేస్తున్నది... అదంతా అంత సులభంగా జరిగేపని అయితేగా ! కోర్టులో వ్యవహారకాండ జరగాలి. అదంతా పూర్తి అవటానికి అధమం నాలుగైదు నెలలయినా పడుతుంది. అటుతర్వాత కోర్టు వాళ్ళ తీర్పుకోసం మరి కొంతకాలం వోపికపట్టి వుండాలి..." ఇదేమీ పట్టించుకోకుండా వుంటున్నాననే ధోరణిలో అన్నాను.

నా మాటలను శ్రద్ధతో వింటున్నది. అంచేత ఎలినార్ నన్ను అర్థం చేసుకున్నదనే అనాలి. నా భుజాన్ని ఆప్యాయంగా తడుతూ, "ఇదంతా పురాణ గాధలకి మించిన కథా కమామీషులలాగే వుందే! వీటినే ఆలోచిస్తూవుంటే మీరెంతో బాధపడాలసి వస్తుంది. కాబట్టి ఈ గొడవనంతా కొంతవరకు మరచిపోవటమే మంచిది. ఇవ్వాళ మాకు కొత్త సరకు వచ్చింది. దాన్లోనుంచి మంచి సీసాను తెచ్చియిస్తాను. దాన్ని రుచి చూశారా మీ కష్టాలన్నీ మాయమైపోతాయి. దాంతో మీరు కుదటపడతారు" అని అంటూ ప్రక్కగదిలోకి చప్పుచప్పున వెళ్లిపోయి నాకు బాగా నచ్చిన పానీయపు సీసాను తెచ్చి బల్లమీద నుంచింది. తనూ నా ప్రక్కనే నిలుచుంది.

"నేను పుచ్చుకోటంతో సరిపోతుందా ? నువ్వూ కొంచెం పుచ్చుకోవాలి. అప్పుడే నా మనస్సు కుదటబడుతుంది" అని ఆందోళనా వుద్వేగాలతో ఒకసారి బుడ్డికేసి చూస్తూ మరొకసారి ఎలినార్ కేసి చూస్తూ అన్నాను.

"మీరు అనేది బాగానే వుంది. కాని ఇప్పుడు అలాటి పనులు చేశానా... అతిధులు వచ్చేసమయం. చూసుకోవాలసిన పని బోలెడంత వుంది..." అని అంటూ ఏదో పని చూసుకోటానికి వెళ్ళిపోయింది...

ఎలినార్ నాకు తెచ్చి ఇచ్చిన బుడ్డి సామాను చాల ఘాటైంది. దాన్ని రుచి చూడాలంటే మంచు

గడ్డలని వేయాలి. లేకపోయిందా మన ఒళ్లు మన స్వాధీనంలోనుంచి పోయినట్లే! నా యీ అయోమయావస్థలో ఆ కిటుకుని గ్రహించే స్థితిలోనుంచే కదూ! గబగబ ఆ బుడ్డినంతా ఖాళీచేశాను. మరో కొత్తదానికి ఆర్డరు నిచ్చాను. అదీ మరోక్షణంలో ఖాళీ అయిపోయింది....

వచ్చే అతిథులకి వెళ్ళే అతిథులకి ఇక అంతూ పంతూ అనేదే లేదు. వాళ్ళ వాళ్ళకి కావలసిన వాటికోసం అందరూ ఎలినార్‌ని పిలవటమే! వాళ్ళకి కావలసినవాటిని చకచక సప్లయి చేయటంలో సతమతమైపోతూవుంది. ఒక్క పానీయాలయితేగా! కాఫీలు, టీలు సప్లయిచేయాలి. భోజన పదార్థాలలో ఎన్నెన్నో రకాలు చరచర తీసుకుని వచ్చి అతిథుల ముందర నుంచాలి. హోటలు యజమాని మామూలు ప్రకారం వంటగదిలో వంటపని చూసుకుంటూ వుక్కిరిబిక్కిరై పోతూవుంది.

ఈ అతిథులంతా ఇవ్వాళ ఇంత తొందరగా భోజనాలకి రావటం నాకేమాత్రం నచ్చిందికాదు. వాళ్లకి సప్లయి చేయలేక సతమతమవుతూ వుంది ఎలినార్. అంచేతనే నా దగ్గర కూర్చుండి మాటామంతీ చెబుతూ నన్ను బుజ్జగించటానికి ఎలినార్‌కి అవకాశం లేకపోయింది. ఎన్ని గ్లాసుల్ని ఖాళీచేస్తూ వున్నా నాకెలా తృప్తి వుంటుంది! ఎలినార్ నన్నిలా ఒంటరిగా కూర్చోబెట్టి తన పనుల్లో మునిగి తేలుతూ వున్నప్పుడు? అంతమంది లోపల వున్నాక ఆ అమ్మాయిని నా దగ్గర వచ్చి కొంచెంసేపు కూచుని కబుర్లు చెబుతూ వుండమని ఎలా అడగగలుగుతాను? ఆ పిల్ల మర్యాదలని వీళ్ల ముందర నిలపాలసిన బాధ్యత నా మీదనే వుందిగా!...

ఎన్నిటిని ఖాళీచేసినా నా దప్పి తీరితేనా! వీళ్ళందరి ముందూ చలాకీగా వుండాలని కాయకష్టలా ప్రయత్నించాను. కాని... కళ్లు చీకట్లు కమ్మాయి. అసహాత్వమంటే ఏమిటో ఇప్పుడు అవగాహన మవుతున్నది. బండి పెదదోవలోకి వెడుతూ వుంది. ఇక దాన్ని రాజమార్గానికి మరలించటానికి మన తరమవుతుందా?

గోరుచుట్టుమీద రోకలి పోటన్నట్లు అంతటితో ఈ కథా కమామీషంత అయిపోతుందా?

## II

బయట పెద్ద కారొకటి చప్పున వచ్చి ఆగిపోయినట్లు సందడిఅవుతున్నది. ఒక పెద్దకారు ఆ సమయాన ఈ హోటలుముందు ఆగటమంటే మాపెద్ద వూళ్లో వాళ్లెవళ్లో భోజనానికోసం ఇక్కడికి వస్తున్నారని తెలుసుకోటం అంత కష్టమైన పని కాదుగా! కారులోనుంచి దిగి తాఫీగా లోపల ప్రవేశించినవాళ్లు ఇద్దరు పెద్దమనుషులు... వాళ్లు తిన్నగా రావటం నా ప్రక్కనే ఖాళీగానున్న బల్ల దగ్గరికే. వచ్చినవాళ్లు వాళ్లవాళ్ల స్థలాల్లో కూచోని భోజనాల గొడవలో వుండిపోతేగా! వాళ్లల్లో ఒకాయన నాకేసి ఎగాదిగా చూస్తూ, మందహాసం చేస్తూ "ఎంతసేపయింది మీరు వచ్చి? అంతా బాగానే వున్నారనుకుంటా!" అని నన్ను పలకరించాడు. ఆయన మా డాక్టర్. మాన్స్‌ఫీల్డ్!

వాళ్లకి కావలసిన పానీయాలని తెప్పించుకుని రుచి చూస్తూ తనతో వచ్చిన ఆయనతో డాక్టర్ మాన్స్‌ఫీల్డు ఏమేమో చెవిలో వూదుతున్నాడు. ఆ పెద్దమనిషి తలవూపుతూ ఏమేమో మెల్లగా అంటున్నాడు. ఇద్దరి చూపులూ పదేపదే నాకేసే చూసుకుని వస్తూవున్నాయి! వాళ్ళ గుసగుసలు నేను త్రాగుతూవున్న పానీయాలను గురించే! అదంతా చూస్తూవున్నాక మండుతూవున్న నిప్పులో ఆజ్యం పడుతున్నట్లు నా ఒళ్లు భగ్గుభగ్గు మండిపోతూవుంది. ఎందుకు వాళ్లు ఇలా రావటం? అలా నాకేసి చూస్తూ గుసగుసలాడుకుంటూ వుండటం? ఆ రెండో ఆయన ఎవరయి వుంటారు? కొంప ముంచి మా వూళ్లోవున్న పెద్ద డాక్టరా మరి? మా వూళ్లో గవర్నమెంటు ఆస్పత్రి వుంది. దాని ముఖ్యాధికారి కూడా ఆ పెద్ద డాక్టరే!...

సాయంకాల సమయంలో డాక్టర్లకి బోలెడు పని వుంటుంది. దానిని చూసుకోకుండా ఈ ఇద్దరు డాక్టర్లు ఇక్కడికి ఇప్పుడు ఎందుకు రావటం? వాళ్లని మార్గా పంపివుంటుందా? ఆవిడ వురుములని, మెరుపులని మరచిపోవడానికి ఇక్కడికే తిన్నగా వచ్చి తప్పత్రాగుతానని మార్గాకి బాగా తెలుసు. ఆవిడ వాదాన్ని ఋజువు చేయటానికి డాక్టర్ సర్టిఫికేట్ అవసరం. మా స్వంత డాక్టర్ ఇచ్చే దాంతో సరిపోదు. ఆస్పత్రి పెద్ద డాక్టర్ దాన్లో సంతకం చెయ్యాలి...

ఉచ్చుత్రాళ్ళని ఇక నామీద వేస్తారు వీళ్లిద్దరూ. వాటినుంచి తప్పుకోటానికి వుపాయం పన్నాలి. కాని యిలాంటి అవస్థలో అలాంటి వుపాయం ఏం తడుతుంది? తప్పత్రాగి వున్నాను. ఇక ఏ నిమిషంలో

ఏ ప్రమాదం వస్తుందో ఎవళ్ళకి తెలుసు ?...

ఎలినార్ ఇలాటి సమయంలో తను మామూలుగా కూర్చుండే స్థలాన్నుంచే ఈ నాటకాన్నంతా తదేకంగా చూస్తూవుంది. నేను అడిగినప్పుడల్లా నా దగ్గరికి వస్తూ, అడిగిన బుడ్లని అందిస్తూ ఆ వివరాలని నోటు పుస్తకంలో వ్రాసుకుంటూన్నది.... లేటుకున్న ఏం తట్టిందో నాకేసి దిగాలుపడుతూ చూస్తూ "ఇంక బిల్లుని తయారుచేసి ఇయ్యవచ్చా ?" అన్నది. ఎలినార్ ఇలా ఇప్పుడు ప్రశ్నించటం నాకు నచ్చింది కాదు. అదీ ఈ డాక్టర్లు వినేటట్లు ! ఇక అక్కడ వుండటం ప్రమాదం అనుకుని బిల్లుని తయారుచేసి ఇయ్యమని కటువుగా అన్నాను. గబగబ వాళ్ళ హోటలు కాగితం మీద బిల్లువ్రాసి తెచ్చి నాచేతికిచ్చింది. ఆ బిల్లు మొత్తం చూశాక గుండె ఆగినంత పని అయింది. జేబుని తడుముకుంటూ నా దగ్గరనున్న నోట్లన్నిటినీ బల్లమీద పడేశాను. అవి బిల్లు మొత్తానికి సరిపోవని తెలుసు. ఆ సమయంలో నాలో రేగుతూ వున్న కోపం ఎలినార్ పసిగట్టింది. తనకి యిలాటి విషయాల్లో కలుగచేసుకోటం ఇష్టం లేదన్నట్లు నటిస్తూ నోట్లని తీసి లెక్కబెట్టుకుంటూ సంచిలో వేసుకుంటూన్నది. అటుకేసి దీనంగా చూస్తూ "వున్నదంతా ఇచ్చాను. ఇంకా బాకీపడితే ఆ సొమ్ముని తరువాత ఇచ్చేస్తాను" నిట్టూర్పు విడుస్తూ అన్నాను ఎలినార్‌తో.

ఆ పిల్ల నా దుర్భరావస్థని బాగా తెలుసుకుంది. "ఫరవాలేదులెండి. రేపు ఇచ్చి వేస్తే సరిపోతుంది..." అని నాకేసి సానుభూతి చూపుతూవున్న ధోరణిలో అంటూ తన పని చూసుకోటానికి వెళ్ళిపోయింది....

ఇంక అక్కడ వుండటం ఏమాత్రం బాగుండదని నిశ్చయించుకున్నాను. కాని ఎక్కడికి వెళ్లటం ? ఈ మాసిన దుస్తులతో, ఈ వికారపు ఆకారంతో వెళ్లటమా ? బాత్‌రూం లోపల ఎక్కడ వుందో తెలుసు. అక్కడికే తిన్నగా నడచి దుస్తుల్ని చక్కజేసుకుని, బయటికి వెళ్ళటానికి కావలసిన ముస్తాబు చేసుకోటం అవసరమని అనుకుంటూ అటుకేసి తిన్నగా నడిచాను. లోపల ఆ పనితో సతమతమవుతూ ఎంతసేపు వున్నానో ఇక్కడ వివరించటమెందుకు చెప్పండి ?...

ప్రయాణానికి అవసరమైన ముస్తాబుని చేసుకుని దర్జాగా బయటికి వచ్చి నా కుర్చీ క్రింద వుంచుకున్న నా సామాన్లని పుచ్చుకుని బయలుదేరాలనుకుంటూ ఒక అడుగు ముందుకి వేశాను.

"ఏమండోయ్ సామ్మర్ గారూ ! బయలుదేర బోతూ వున్నట్లూ వుందే ? ఒక్క నిమిషం ఇలా వస్తారా ?" అని మా డాక్టర్ నన్నే అంత ఆత్రతతో పిలుస్తున్న కంఠాన్ని విన్నాక హడలిపోయాను. ఆ ఆందోళనలో ఏం అన్నానో మరి ?...

"ఎందుకలా ఆందోళన పడటం ? మేం ఏం చేయలేదే ?" అని డాక్టర్ మాన్స్‌ఫీల్డు జాలిగా నా వంక చూస్తూ అన్నాడు.

"ఏం ఫరవాలేదండి డాక్టర్. బయటికి వెళ్ళ బోతూ వున్నప్పుడు అంత చనువుగా పిలుస్తున్న వాళ్లెవళ్లై వుంటారా అని అలా కంగారుపడ్డాను. మీరే నా దగ్గరగా కూర్చున్న వాళ్ళని గుర్తించలేదు. క్షమించండి..." అని ఆయన కోరికను మన్నించకుండానే ముందుకు నడవటం మంచిదనుకుంటూ కొన్ని అడుగులు వేశాను....

డాక్టర్ మాన్స్‌ఫీల్డ్ తను కూర్చున్న చోటినుంచి చటుక్కున లేచి నా దగ్గరికి వచ్చాడు. ఎంతో చనువువున్న వాళ్ళకిమల్లె నా భుజాన్ని తడుముతూ "మేం వచ్చిన పని ముగిసింది. మేమూ తిరిగి వూళ్ళోకి వెళ్ళబోతున్నాం. కార్లో మీరూ మా వెంట రావచ్చు..." అని ఒక్క క్షణం ఆగాడు. తనతో వచ్చిన మిత్రుడికేసి చూస్తూ "ఈయన్ని మీకు పరిచయం చేయటం ముఖ్యంగా ! ఈయనే సామ్మర్ గారు" అని అన్నాడు. ఆయన్ని నాకు పరిచయం చేయటానికి కాబోలు "వీరు డాక్టర్ స్టీబింగ్. మన వూళ్ళో గవర్నమెంటు ఆస్పత్రిలో పెద్ద డాక్టరు" అని మందహాసంచేస్తూ అన్నాడు.

ఇంకేం చేయగలుగుతాను ? కసాయివాళ్ళ చేతుల్లోపడ్డ మేకకిమల్లె నేను అనుకున్నంత పని అయిపోయింది. ఒకవైపు మా డాక్టర్ మాన్స్‌ఫీల్డ్, ఇంకొకవైపు పెద్ద డాక్టర్ స్టీబింగ్ గట్టిగా పట్టుకుని కారులోకి తీసుకుని వచ్చి కూర్చోబెట్టారు....

ఇదంతా మాగ్దా చేసిన తంత్రం. దానిని తలుస్తూ వుంటే ఒళ్ళంతా కుతకుతలాడిపోతూ వుంది. దాంతో కోపం కెచ్చిపోతూ వుంది. ... మేకపోతు గాంభీర్యాన్ని చూపుతూ ఈ గడ్డు గండాన్నుంచి ఏలాగో బయటపడాలని ప్రయత్నిస్తూ వున్నాను....

అంత ఆప్యాయంతో వాళ్ళ కారులో వూళ్ళోకి తీసుకుని వెడుతూ వున్నందుకు వాళ్ళిద్దరికీ కృతజ్ఞతని తెలిపాను. కాని లోపల భయం. చెప్పరానంత భయం. ఎంత పిచ్చి ధైర్యాన్ని తెచ్చుకుంటూన్నా అది ... ... ... ? ... వాళ్ళ చేతుల్లో ఖైదీనై పోయాను... వాళ్ళు వూళ్ళోకని మరెక్కడికి తీసుకుని వెడుతారో ?...

అంతా అయోమయావస్థ. దాన్తోదరీదాపూతోచక వుక్కిరిబిక్కిరై పోతూవున్న సమయంలో ఎలినార్ గబగబ లోపలినుంచి కారున్న చోటికి వచ్చింది. చేతిలో ఏదో ప్యాకెట్. దాన్ని నామీద పడేస్తూ "ఆ రోజున ఇక్కడ వదలిపెట్టి వెళ్లారే మీ బూట్సులని! వాటిని ఇంతకాలం జాగ్రత్తగా మీకోసం దాచివుంచాను. మీరు హోటల్లోకి వచ్చినప్పుడే ఇయ్యాలని అనుకున్నాను - పని తొందరల్లో ఆ సంగతి మరచిపోయాను..." చిరునవ్వు నవ్వుతూ అంది. ఆ పని పూర్తిచేసుకున్నాక ఇక అక్కడ వుండటం సబబు కాదనుకున్నదో ఏమో మరోక్షణంలో ఎలినార్ అక్కడినుంచి అదృశ్యమైపోయింది....

ఇద్దరు డాక్టర్లు ఈ దృశ్యాన్ని వింతగా చూస్తూ వున్నారు. మా డాక్టర్ నాకేసి కటువుగా చూస్తూ "ఇక కారు కదలవచ్చునా?" అని అన్నాడు.

"ఊఁ" అని అంటూ తల నూపాను. ఇలాటి విషమావస్థలో అంతకన్నా మరేం చేయగలుగుతాను ?

(సశేషము)



# కారు నడుపుతూ నిద్రపోవచ్చు

స్వంత మోటార్లలో ప్రయాణం చేసే వారికి దూరపు ప్రయాణాలు సుకరం చేయడానికి ఫెడరల్ జర్మన్ రైల్వే వారొక కొత్త పథకం అమలుపరిచారు. కారు గల వారు, ప్రయాణంచేసే రైలులోనే వారి కారు కూడా తీసుకువెళ్ళడానికి ఇప్పుడు తగు ఏర్పాట్లు చేశారు. దీనివల్ల శెలవు రోజుల్లో, దూరప్రాంతాలలో కాలక్షేపం చేయడానికి కొత్తపద్ధతి ఎంతో ఆకర్షణీయంగా వుంది. జర్మన్ రైల్వేలలో జన సమ్మర్దం బాగా ఎక్కువగావున్న మార్గాల మీద నిరుడు ప్రయోగచర్యగా, ఇటువంటి రైళ్లు పది నడిపారు. ఈ రైళ్లు యూరప్ మధ్యభాగంలో, స్కాండినేవియా నుంచి రోమ్ నగరం వరకూ నడిచాయి. ఈ రైళ్లలో మొదటి దానిలో 51 మోటారు కార్లు ప్రయాణీకులు తమతో తీసుకువెళ్ళారు.

ప్రయాణీకులు తమ కార్లని ఒకచోట నుంచి ఇంకొక చోటుకి తీసుకువెళ్లడంలో కొత్త ఏమీలేదు. కాగా ఇదివరకు మోటారు కార్లు సామాను రైళ్లలో వెళ్లేవి. అందుచేత కారు గలవారికి తమ కారు ఎప్పుడు చేరుతుందో ఇదమిద్ధంగా చెప్పడం వీలయేదికాదు. నేడలా కాదు. దూరపు ప్రాంతాలకి కారులలో వెళ్ళదల్చుకున్న యాత్రీకులు సరాసరి కారులో స్టేషనుకి వెళ్ళి, కారును తిన్నగా ఈ రకం రైలులో వుంచి, అదేరైలులో తాము కూడా ప్రయాణంచేసి గమ్యస్థానం చేరుకోగానే, తమకారు తామే నడుపుకుంటూ తమ ఇష్టంవచ్చినచోటుకి హాయిగా వెళ్ళడానికి వీలుంటుంది. రాత్రి అంతా నిద్ర లేకుండా కారు నడుపుకోవల్సిన అవసరం లేదు. ఎంతో ఉత్సాహంతో శెలవు రోజులు గడుపుకోడానికి యీ రైళ్లు ఉపయోగిస్తున్నాయి.

# ఉండాలి!



తాతకు కర్ర
అవ్వకు మంచం
పాపకు అమ్మ
ఉండాలోయ్ వుండాలి

ప్రజలకు రాజ్యం
ప్రభులకు న్యాయం
పాటకు రాగం
ఉండాలోయ్ వుండాలి.

రైలుకుపట్టా
కారుకుహారన్
కత్తికిపదును
ఉండాలోయ్ వుండాలి.

రోగికిమందు
భోగికివిందు
నోటికిహద్దు
వుండాలోయ్ వుండాలి

కంటికినిద్ర
వొంటికి వస్త్రం
బొజ్జకు బువ్వ
ఉండాలోయ్ వుండాలి.

ఇంటికి కప్పు
వానకు మబ్బు
బండికి చక్రం
ఉండాలోయ్ వుండాలి.

కన్నెకు వరుడు
నాన్నకు డబ్బు
అమ్మకు శాంతం.
ఉండాలోయ్ వుండాలి.

ఏటికి కట్ట
వూరికి మిట్ట
కోమటి కొట్టు
ఉండాలోయ్ వుండాలి.

పూజకు భక్తి
పూవుకు తావి
నేతకు నూలు
ఉండాలోయ్ వుండాలి.

గోడకు సున్నం
నారుకు నీరు
నీటికి పల్లం
ఉండాలోయ్ వుండాలి.

రాజుకు ఛత్రం
మోజుకు గాత్రం
ఈవికి పాత్రం
ఉండాలోయ్ వుండాలి.

పంచకు వాలు
పాముకు పుట్ట
పూలకు బుట్ట
ఉండాలోయ్ వుండాలి .

చీరకు మూర
వనితకు సిగ్గు
సిగలో పువ్వు
ఉండాలోయ్ వుండాలి.

వంటకు చెరకు
గుంటకు నీరు,
గంటకు నాదం
ఉండాలోయ్ వుండాలి.

కాపురం గుట్టు
రోగం రొష్టు
కుంకుమ బొట్టు
ఉండాలోయ్ వుండాలి.

శెట్టికి బేరం
కొట్టుకు ద్వారం
కోటుకు జేబు
ఉండాలోయ్ ఉండాలి.

పంటకు రైతు
చేనుకు కంచె
కాడికి ఎద్దు
ఉండాలోయ్ వుండాలి.

సూటుకు బూటు
నెత్తికి హేటు
గోటుకు సీటు
ఉండాలోయ్ వుండాలి.

ఇంటికి ఆలి
రత్నకు మాలి
వూరుకు బాట
ఉండాలోయ్ వుండాలి.

వానకు గొడుగు
ఎండకు నీడ
చదువుకు విత్తము
ఉండాలోయ్ వుండాలి.

గంజికి నంజు
దాంతికి శాంతి
మంత్రికి తంత్రం
ఉండాలోయ్ వుండాలి.

భుక్తికి విద్య
వత్తికి చమురు
పెట్టికి తాళం
ఉండాలోయ్ వుండాలి.

ఆటకు రక్తి
ఆవుకు పాలు
తేనెకు తీపి
ఉండాలోయ్ వుండాలి.

పెళ్లికి మేళం
పెన్నుకు సిరా
చేతికి దానం
ఉండాలోయ్ వుండాలి.

సూదికి దారం
వీణకు తీగ
తోటకు బావి
ఉండాలోయ్ వుండాలి.

తారకు భావం
చిత్రానికి చీకటి
గుర్రానికి కళ్లెం
ఉండాలోయ్ వుండాలి.

జిహ్వకు రుచి
శక్తికి రక్తం
రోటికి పోత్రం
ఉండాలోయ్ వుండాలి.

—(o)—

# డ్రైవరు లేని రైళ్లు

పశ్చిమ జర్మనీలో పెద్ద రేవునగరం, పెద్దపట్టణం అయిన హేంబర్గులో రవాణా సౌకర్యాలకి చాలా చక్కని ఏర్పాట్లు ఉన్నాయి. ఏవిధమైన ఇబ్బంది లేకుండా నగరంలో ఉన్న 20 లక్షల మందికీ కావల్సిన చిన్నరకాల బస్సులు, పెద్ద బస్సులు, రైలుకార్లు మొదలయినవి ఉన్నాయి. అయినా హేంబర్గు నగరపు రవాణా శాఖవారు డ్రైవర్ల అవసరం లేకుండా, వాటంతట అవే నడిచే రైళ్లు ఏర్పాటు చేయడానికి ఆలోచిస్తున్నారు. నిజానికి ఆ రైళ్లలో డ్రైవరు లేకపోయినా, వాటిని దూరాన్న ఉన్న ఒక కేంద్రంనుంచి, ఎలక్ట్రిక్ యంత్రాల సహాయంతో నడపడం జరుగుతుంది.

దశాబ్దాలుగా ఇటువంటి రైళ్లని పిల్లల వినోదార్థం, ఇదివరకే ఆటవస్తువులుగా తయారుచేస్తున్నారు. ఇటువంటివాటిని యిప్పుడు పెద్ద ఎత్తున ప్రజలకోసం అమలుజరపాలని ఇంజనీర్లు ప్రయోగ చర్యలు ప్రారంభించారు. దీనికి కావల్సిన రైలు కార్లని తయారుచేయడం ఆరంభించారు. డ్రైవరు అవసరం లేకుండా, వాటంతట అవే పనిచేసే పరికరాలని, నూటికి 75 వంతుల వరకూ భూగర్భం నుంచి నడిచే రైళ్లలో ఇదివరకే ప్రవేశపెట్టారు.

ఇప్పుడు ఏదో ఒకేఒక్క కేంద్రంనుంచి నిర్వహించడానికి వీలుగావుండి డ్రైవర్లు అవసరంలేని రైళ్లని నగరంలో ప్రవేశపెట్టాలని ఆలోచిస్తున్నారు. ఈ మాత్రం పశ్చిమ జర్మనీ అంతటిలోనూ కూడా ఇదివరకే అమలులో ఉంది. దేశమంతటిలోనూ రైళ్లలో, అవి ఆగవల్సిన చోట, ఆగవల్సిందని సిగ్నల్సు ఇచ్చినచోట, డ్రైవరు ఒకవేళ మరిచిపోయినా కూడా వాటంతట అవే పనిచేసే బ్రేకులు అమర్చారు. పూర్తిగా మానవసహాయమే అక్కరలేకుండా పని జరగడం ఎప్పుడూ సాధ్యంకాదు. దానికి కారణం వాటంతట అవే పనిచేసే ఎలక్ట్రానిక్ పరికరాలు నిర్వహించడానికయినా మనిషి అవసరం తప్పదు. అంతేకాదు. అనుకోని సంఘటనలు ఎన్నో సంభవించవచ్చు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఏ పిల్లవాడో, ఏ జంతువో రైళ్లకి అడ్డంగా రావచ్చు.

అందుచేత మానవ ప్రజ్ఞకి సాధ్యమయినంతవరకూ సురక్షితమైన పద్ధతులలో రైల్వేలని ఆధునికం చేయాలని హేంబర్గు నగరంలోని రవాణా శాఖవారి ఆశయం.

# తొందరపాటు

కుమారి ఇందిర

బాలసూర్యుని పసిడి కిరణాలు కిటికీగుండ వచ్చి నా లేతచెంపకు తాకి ముద్దిడినట్లుగా యున్నవి. పాల మనిషి గేదెను యింటి దగ్గరకు తెచ్చి ఝురు...ఝురు మంటూ పితుకుతుంటే సంగీతము పాడినట్లుగా యున్నది. అక్కయ్య పనిపాటలలో మునిగిపోయినది. చిట్టివాడు వచ్చి, 'పిన్నమ్మ! లేవవూ!' అంటూ కొంగుపట్టి లాగుతున్నాడు.

దిగ్గున లేచాను. "చిట్టీ, నీ మొఖము చూసాను, రా, ఈ రోజు ఏమవుతుందో చూడాలి!" వళ్లు విరుచుకుంటూ ముందు వసారాలోనికి వచ్చి నిలుచున్నాను.

కాంపౌండ్‌లో వేసిన పూలమొక్కలు సూర్య కాంతికి అప్పుడే విచ్చుకుంటున్నవి. ఎడమవైపు వేసిన ప్రొద్దు తిరుగుడు పువ్వు, తిన్నగా ఉదయ భానునివైపు తిరిగి శ్రద్ధగా అంజలిని సమర్పించినది. అప్పుడే కుసుమించిన గులాబీలు, పారిజాతాలు విరహ వేదన తాళజాలము, 'వచ్చిమమేలుకొనవు' అంటూ వయ్యారంగా పిలుచుచున్నవి. ప్రకృతి పచ్చగా మెరసిపోవుతున్నది. 'డబల్ రొట్టి' అంటూ సైకిల్ మీద పోవు అబ్బాయి, రొట్టిని అమ్ముకుంటూ పోవు చున్నాడు. అతని ధ్వనికి తిరిగి ఈ లోకమునకు వచ్చి పడ్డాను.

ఎడమవైపునుంచి, నన్నెవరో గుచ్చి, గుచ్చి చూస్తున్నట్లుగా తోచుచున్నది. అనుకోకుండ, నా దృష్టి ఆ వైపుకు ప్రసరించినది.

తెల్లటి పంచ, కండరాల కంటుకొనిపోయిన బనీను, భుజముపైన పచ్చటి టర్కిటవల్, నోటిలో బ్రష్షు, ముంగురులు కంటి కడ్డముగా పడుతున్నప్ప టికి, తీసుకొనుటకు ప్రయత్నించకుండ నావైపే చూస్తున్నాడు. ఆ చిలిపి చూపులు, కొంటె నవ్వులు నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయి. ఒక్క నిమిషమైన అక్కడ నిలబడలేకపోయాను. వెంటనే లోపలికి దూడు తీసినాను.

ఎవరబ్బ, ఈ మన్మథుడు. - ఎంత అందంగా యున్నాడు! నల్లటిజుట్టు వంకులు తిరిగి, చిందరవంద రగా ఎలా నాట్యమాడుచున్నవో చూడు. అబ్బ... ఇంక, ఇటువైపే కిటికీగుండ చూస్తున్నాడు కదా! ఎంత గడుసరిగా నున్నాడు! నిజంగా ఈ కలియుగ మదనుని వశపరుచుకొన్న రతి ఎవరైయుండును. ఆ యింటిలో ఒక్క ముసలామె మాత్రమే నిన్నటి రోజునుంచి కనబడుతున్నది. పెండ్లి కాలేదు కాబోలు. వివాహితుడైన నన్ను రెప్పవాల్చకుండ చూడవలసిన అవసరమేమున్నది! ఈ అందాలరాయు నికి ఎంత చక్కటి పేరు యుండునో! ఏ ఆఫీసులో పని చేయుచున్నాడో? జీతమెంత అయియుండునో? పోనీ, అక్కయ్యను అడిగి వివరాలను తెలుసుకొంటే! అమ్మ, బాబో, ఏమైనయుందా! చెంపకు రెండు అంటించదూ! పోని ఒక ఉత్తరము ముక్క వ్రాసి, కిటికీగుండ వేసిన సమ్మతిస్తాడో, లేడో...ఇష్టము లేనియడల, ఎందుకలా చూస్తాడు? కాలేజిలో సుందర్ కూడ, ఇలాగే కదూ! చూస్తూయుండి ప్రేమంటూ నా ఎదుట వలుకపోసేందుకు వచ్చింది. అంతెందుకు మా పక్కింటి గోపి, కాలేజి లీడర్ కుమార్, ఇతనిలాగే కదూ వెకిలిగా నవ్వుతూ, చిలిపిగా చూస్తూ నన్ను ప్రేమిస్తున్నామని, ప్రేమ లేఖలను కనకవర్షములా కురిపించింది! ఆ నడవడికలు, ఆ చూపులు చూస్తుంటే, నిజంగా అతను నన్ను ప్రేమిస్తున్నట్లుగానే తోస్తున్నది. ఎంతని కనుగొన గలము ఈ కాలపు అబ్బాయిల మనస్తత్వాలు! ధైర్యే...సాహసే...లక్ష్మీ అన్నారు. వేచి చూస్తాము ఒక పాచిక.

♦ ♦ ♦

ప్రియమైన...

మీ పేరు తెలియక మిమ్మలను పేరుతో సంబో ధించలేకపోవుచున్నాను. మీ దర్శన భాగ్యమునకు పుష్పాంగిపోయాను. మిమ్మలను చూడగానే, ఏదో దేవదూత నా ఎదుట వచ్చి నిలబడ్డదని భ్రమ కలి గింది. విశాలవక్షము, వంపులు తిరిగిన కండరాలు, చక్కటి కళ్లు, ఉంగరాల వెంట్రుకలు నన్నెంటే ఆకర్షించినవి. నిజంగా మీరు ధన్యజీవులు. నా చూపే చాలని, నా పిలుపే బంగారమని కలువరించు

నా సహవిద్యార్థులకు పెడదారి చూపినాను. మిమ్ములను చూస్తుంటే నాకెందుకో మనస్సు కలవరము జెందుతున్నది. నా పేరు సుమిత్ర. ఉస్మానియా కాలేజిలో బి.ఏ. పరీక్షలు వ్రాసినాను. సెలవుల్లో రోజులు గడుపుట కష్టముగా యున్నందున ఇక్కడికి మా అక్కయ్య దగ్గర కొన్ని రోజులుండి పోవుదమని వచ్చినాను. ఈ సనత్‌నగర్ ప్రకృతి నాకు బాగా నచ్చింది. ఇంక రెండు మూడు వారాలుండి గాని, సిటీలోనికి పోను. క్రిక్కిరిసిన ఆ నగరాలలో యుండుటకన్న, ప్రశాంతమైన ఈ బయలు స్థలములలో ఎంతో ఆరోగ్యకరముగా నుందును.... రాజా! ప్రతి స్త్రీ తన ప్రియుని సంబోధించుటకు ఉబలాటపడు పేరుతోనే, మిమ్ములను కూడ పిలుచుటకు ఉవ్విళ్లూరుతున్నాను. నేను వ్రాసిన ఉత్తరమునకు కినుక వహించక, నాపైనున్న మీ ప్రేమానురాగమును సవిస్తారముగా తెలియపరిచెదరనిన మ్ముతూ ఇక చాలిస్తున్నాను.

ప్రేమతో,
మీ
సుమిత్ర

♦ ♦ ♦

గడియారం 9 గంటలను చూపిస్తున్నది. అతడు ఏమి చేస్తున్నట్లు! ఇంతవరకు బదులు వ్రాసి పంపలేదు. కాలకృత్యములలో మునిగియుండవచ్చు. అదుగో, స్నానముచేసి కాబోలు వస్తున్నాడు. ముత్యాలలాగా నొదటిమీద నీటిబిందువులు మెరసి పోవుచున్నవి. క్రాపు అంతా పూర్తిగా చెదిరిపోయినది. చెవిని టవలుతో తుడుచుకొంటూ తిన్నగా కిటికీ దగ్గరకు వచ్చినాడు. అతని ప్రతి పనిలోను ఒక క్రొత్త తీరు కనబడుచున్నది. నడక మంచి స్టయిల్‌లో యున్నది. ఎంత వయ్యారంగా నవ్వుతాడు. ఏమి యీ సైగలు...ఓహో!...బదులు వ్రాస్తాడంట... ఆఫీసుకు పోవునప్పుడు యింటి ముంగట వేసి పోవునట, పోయి తీసుకొనవలయునట...

సన్‌పకలర్, గ్యాబర్డిన్ ప్యాంటు, తెల్లటి షర్టును టక్ చేసికొని, బూట్లు టక్‌టక్ మంటూ శబ్దము చేసికొంటూ యింటి ముంగటినుంచి పోవుచు, జేబురుమాలను తీయునట్లు నటించుచు, ఒక తెల్లటి చీటీని పారవేసి పోయినాడు. ఏదో ముత్యం పడ్డట్లనిపించింది. గేటు తీసుకొని, ధైర్యముగా ముందుకు పోయినాను. ఎవరో సైకిలుమీద పోవుచూ, చీటీ మీదుగా సైకిల్ పోనిచ్చినారు. జనమంత ఆఫీసులకు పోవుచున్నారు. చీటీ తీసుకొనునప్పటికి తల ప్రాణము తోకకొచ్చింది.

♦ ♦ ♦

సుమిత్ర ప్రియా!

నీ ముత్యాలలాంటి అక్షరములను చూసి ముగ్ధుడైనాను. వంపులు తిరిగిన శరీరము, సింహ మధ్యము, బిగువైన కండరాలు, తెల్లటి నీ పలువరుస, వెన్నెలలాంటి నీ చిరునగవు, లేత పెదవులు, కిన్నెర స్వరములాంటి నీ కంఠము నన్ను మైమరపించి, నిన్ను నా సొత్తుగా చేసికొని తీరవలయునని నా మనస్సు ఉవ్విళ్లూరుతున్నది. ఇప్పుడు ఆఫీసుకు పోవుచున్నానే కాని పని సక్రమంగా చేస్తానన్న నమ్మకంలేదు. ఉత్తరము వ్రాస్తూయుంటే నీ కమనీయమైన ముఖము వచ్చి కళ్లు చిట్లిస్తూ, ఎదురుగా సాక్షాత్కరించినట్లుగా నున్నది. నాకు కవిత్వములో ఏమంత ప్రావీణ్యతలేదు, నిన్ను వర్ణిస్తూ కూర్చొనజాలను. ఒక్కమాటలో చెప్పచున్నాను _ నీ సొగసు నాకు బాగా నచ్చింది. నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. నీ అమృతహస్తాలతో నన్నెన్నడు బిగించగలవు! చక్కటి నీ కళ్లతో నా చిలిపిచేష్టలను ఎన్నడు మందలించగలవు! వెన్నెల రాత్రులలో ఎన్నడు మనమేకమై తిరుగగలము! ... ఆఫీసుకు టైమగు చున్నది. ఈ రోజు మా అమ్మగారు కూడ బంధువుల యింటికి పోవుచున్నది. నీవు సరిగా గం. 6_30 లకు సీలు చూసుకుని నా రూములోనికి వచ్చెదవని నమ్ముచున్నాను. మిగత విషయాలు మన యిద్దరి సమక్షం... ఇక ఉండనా, మరి.

ఇట్లు,
నీ
ఆనంద్.

♦ ♦ ♦

'ఆనంద్'...ఎంత చక్కటి పేరు. కవిత్వము గాదని, కవిత్వమంతా వొలకపోసినావు కదయ్యా! తెల్లటి నీ పలువరుస...వెన్నెలలాంటి చిరునగవు... లేత పెదవులు. అబ్బా! కవి కాళిదాసును మించినవాడవుగా నున్నావు. ఉత్తరాన్ని ఎన్నిసార్లు చదివానో లెక్కలేదు. చదువుతూ అలాగే కళ్లు మూశాను.

ఒంటిగంట అగుతుంది. చిట్టి వచ్చి భోజనానికి

లేపాడు. తినేందుకు కూర్చున్నానేకాని ఏమీ సరి పడడములేదు. మనస్సంత ఎందుకో కలవరముగా నున్నది. రెండు మెతుకులు ఎంగిలిచేసి వచ్చి తిరిగి పరుపుపై పరుండి అటుయిటు దొర్లనారంభించి నాను....

◆ ◆ ◆

"ఆనంద్! నాకన్న ముందుగానే వచ్చావే, అహ! నిజంగా ఈ డ్రస్సులో ఎంత అందంగా యున్నావు. తెల్లటి పైజామా, గ్లాస్కో లాల్చి, నల్లటి కళ్ళజోడు - ఈ డ్రస్సు నాకు బాగా నచ్చుతుందని ఎలా తెలుసుకున్నావు?"

"నీవు మాత్రము, నాకు నచ్చని డ్రస్సులోనా యున్నావు! లేత కనకాంబర రంగుచీర, నీలాకాశపు రంగు వెల్‌వెట్ బ్లౌజు, నాకు యిష్టమైన సన్న జాజులు నీ శిగలో, అహ! ధగధగ మెరసే మెళ్లోని నెక్‌లెస్ సుమీ! నిన్ను చూస్తే, ఆ రతి నీకన్న అందంగా యుండునా అనిపిస్తుంది సుమా!"

"పోనీ, చాలించండి మీ పొగడ్తలు. అదుగో, ఆ కొలను చూడండి ఎంత సోయగాన్ని గూర్చు చున్నదో. అమృతములాంటి ఆ నీటి మధ్యమున, రత్నాలలాగా ఆ కలువలు మెరుస్తున్నట్లు లేదూ! పదండి సమీపించి ఆ అందములో మనము కూడ భాగము పంచుకుందాము."

"ఆనంద్! ఈ తుమ్మెదలు కమలముల చుట్టూ ఎందుకలా ప్రాకులాడుతూ, వాటిపైన వ్రాలు చున్నవో చెప్పగలవా?"

"బి. ఏ. చదివిన అమ్మాయివి, ఈ శాస్త్ర తెలియకుండునా!" కావాలని అడుగుచున్నావు కదూ! మరేమిలేదు, "కమలము తన అందాన్నంతటిని విప్పి, తుమ్మెదలను అట్టే ఆకర్షించి, వాటిలో స్నేహము చేసికొని, హాయిగా కాలము గడుపును."

"ఒకవేళ కమలము వాడిపోయి వికసించుటకు శక్తిలేని సమయమున?"

"తుమ్మెద మరో వికసించిన కమలమును వెదుక్కుంటూ పోయి దానితో స్నేహమునకు చేయి కలుపును."

"అలాగే నాకు ఏదైన లోటు సంభవించిన, నీవు కూడ..."

"సుమిత్రా, ఏమిటా మాటలు" అంటూ తన మునివ్రేళ్ళతో నా నోటిని మూసినాడు.

"ఎన్ని కష్టాలు రానీ, నిన్ను నానుండి ఎవ్వరూ వేరుచేయజాలరు. కలో, గంజియో, ఇరువురము సమముగా త్రాగి కష్టాలను ఎదుర్కొంటూ, మన ప్రేమలతను ఆకాశము వరకు పెంచి, ధ్రువతారను కలుసుకొని అతనివలె మన ప్రేమ, అనురాగము, బాంధవ్యము కలకాలము ప్రకాశించునట్లు చూస్తాను. మరేమి భయపడకు. నేను నిన్ను తప్ప మరెవరిని వివాహమాడను....అదుగో, ఆ కృష్ణభగవానుని గుడి దగ్గరకు పోయి, అతని సమక్షములో మన మిరువురి మధ్యనున్న పెండ్లి కాలేదనెడి తెరను తొలగించి, హాయిగా ఈ రాత్రి వెన్నెలలోనే గడిపి తిరిగి పోవుదము..."

◆ ◆ ◆

"ఏం సుమిత్రా, ఏమిటా పాడునిద్ర ప్రొద్దస్తమానము-లే" అంటూ అక్కయ్య తట్టి లేపేంతవరకు అది నాకు వచ్చిన కల అని తెలియదు.

"పగటి కలలు కంటున్నావా!" అంటారు పెద్దలు. అవంటే నాకు బొత్తిగా నమ్మకము లేకుండెను. పగలు కూడ కలలు వస్తాయా అంటూ భ్రమ పడేదానను. నిజంగా ఎంత చక్కటి కల. శనిలా వచ్చి, బంగారులాంటి నా కలను పాడుచేసింది. కృష్ణభగవానుని సమక్షములో ఏమి జరిగియుండునో... ఆనంద్‌తో హాయిగా ఆ వెన్నెలరాత్రిని కలలోనైన అనుభవించకుండ చేసింది. నిజంగా నా కలే నిజమైతే నా అంత అదృష్టశాలి ఎవరున్నారు. ఆనంద్ లాంటి అందగాడు భర్త కావడముకన్న నేను ఈ ప్రపంచములో కోరుకొనునదేమున్నది.

◆ ◆ ◆

వానకురిసి వెలిసింది. గగనాన తెల్లటి కొంగలు బారులుగా తీరి తోరణము కట్టినట్లుగా యున్నది. ఆకాశాన ఇంద్రధనస్సు ఏర్పడ్డది. మలయమారుతము చల్లగా వీస్తున్నది. నిజంగా ప్రకృతి అందాల ఆభరణాలను తొడుక్కున్నట్లుగా యున్నది. ఒక్కొక్కరుగా ఆ కాలనీలోని వనితలు నీటుగా సింగారించుకొని వాకిటిముందు వచ్చి నిలబడ్డారు. అప్పుడే నాలుగవ నంబరు యింటి బట్టతలమనిషి, సంచీ నిండుగా కూరగాయలను తీసుకొని సైకిల్ దిగినాడు. ఆ యింటావిడ ఆప్యాయంగా వచ్చి చేతిలోని సంచిని తీసికొని, తిన్నగా ఒక చిరునగవు విసరింది. అబ్బ, ఇంత వయస్సులో కూడ వారు ఎంత అన్యోన్యంగా

యున్నారు! అలాగే 6-వ నంబరు నవజవ్వని, భర్త తెచ్చిన ఫైల్స్‌కట్ట నందుకొని కుశలప్రశ్న లడుగుచున్నది. అప్పుడు తెలిసింది, ఈ వనితలు వాకిటి ముందు నిలబడుటకు కారణాలు. పాపం, ప్రొద్దుననగా ఇంత తినిపోతారు. ప్రొద్దస్తమానము ఆఫీసులో ఫైల్సులతో పోట్లాడి, ఆఫీసర్లతో చీవాట్లు తిని పాలిపోయిన ముఖాలతో ఇండ్లకు వస్తారు. అటువంటి వారికి ఆ కాస్త చిరునగవుతోనైన స్వాగతము యిల్లాలు పలుకకపోయిన ఆ వ్యక్తి బేజారైపోడూ! "గృహమే కదా, స్వర్గసీమ!" అన్నారు. ఎన్ని కష్టాలు, చీవాట్లు, ఇబ్బందులు పడి వచ్చినప్పటికీ, యింటిలోని పిల్లలను, భార్యను చూడగానే ఏ మనిషి అయిన అట్టే మరిచిపోకుండ మానడు!

అందరికి వారివారి భార్యలు చిరునగవుతో ఆదరించిరి. పాపం, నా ఆనంద్‌కు ......?

'నీవున్నావుగా' అన్నది అంతరాత్మ.

అంతే, ఐదు నిమిషాలలో తయారైనాను. కలలో నేను కట్టిన తెలతెల్లని కాంబరపు రంగుచీర, నీలాకాశపు వెల్‌వెట్ బ్లౌజు, నా నెక్‌లెస్ తెచ్చేటందుకు మరిచిపోయినందున, అక్కయ్యది వేసికొన్నాను. అద్దములో ఏ అయిదారు సార్లు చూసుకున్నానో. తిలకము తీసి దిద్దుకుంటుంటే, "అంతమె ఆనందం" అను పాట తనంతటతానే నోటికుండ వచ్చింది. కుడిచేతికి ముంజేతివరకు ఎర్రటి గాజుల నెక్కించినాను. ఎడమచేతికి రిస్టువాచి, లైటుగా మొగాన పౌడర్. 'రండి, నాతో పోటీకి నిలబడగలరా' అన్నట్లుగా నేనుకూడ వాకిట్లోకి పోయినాను.

పోయినదే తడవుగా బావగారు సైకిల్ దిగి వచ్చారు.

"ఏం సుమిత్రా! ఇవాళ నీవున్నావు? నిజంగ ఎంత అదృష్ట మీనాటిజు. మీ అక్కయ్య ఏం చేస్తున్నది?" అంటూ నవ్వుతూ దగ్గరకొచ్చాడు.

"చిట్టికి స్నానము చేయిస్తుంది" అంటూ "అక్కయ్యా! బావొచ్చాడే" అంటూ కేక వేసాను. పాపం బావకూడ, 'లక్ష్మి' అంటూ యింటిలోనికి పోయినాడు.

అడుగో, నా ఆనంద్ వస్తూనేయున్నాడు, తలపైని ముంగురులు నీటుగా నొసటిపై పడి నాట్యమాడుచున్నవి. ఆనంద్ ఎంత అలసినప్పటికి అందంలో లోటేమి కానరాదు. 'నిన్ను అందంలో గెలుచువారెవరయ్యా' అనుకొన్నాను.

ఇంటి దగ్గరకొచ్చాడు. నాకన్న ముందుగానే ఒక చిరునగవు విసిరాడు. మంచి గడుసువాడే. నేనుకూడ మందహాసముచేయుట మానలేకపోయితిని. మా రెండు చిరునగవులు నడిద్రోవలో ఢీకొన్నవి. తిన్నగా తన గదిలోనికి పోయాడు.

ఇక నాకేమి పనియున్నదక్కడ? "నీ డ్యూటీ అయినది లోపలికి పోవచ్చు" అన్నారెవరో నాలో. మెల్లగా యింటి లోపలికి పోయినాను. బావగారు వాలుకుర్చీలో కూర్చుని, కాఫీ చప్పరిస్తున్నారు. అతని ముందున్న స్టూలు లాగుకొని అక్కయ్యకు కాఫీ కార్డరిచ్చాను. చిట్టిచేత కాఫీ పంపింది అక్క. పాపం వాడు వణుకుతున్న చేతితో కాఫీ పట్టుకొని వస్తున్నాడు.

'చిట్టీ! నాపైన ఎంత ప్రేమ!' అంటూ వాడి చేతిలోని కప్పును తీసుకొని, వడిలోనికి ఎత్తుకొని గట్టిగా ముద్దుపెట్టుకున్నాను.

"ఆ...ఆ...ఇంక చాలు, రేపు పెండ్లికాగానే నీకు పుట్టబోయే చిరంజీవికి కాస్తయుంచుకో" అన్నాడు బావ.

"పో, బావా! నీకెప్పుడు పెండ్లి గొడవలే, అసలు నేను పెండ్లే చేసికొనదలచలేదు."

"ఆ, ఇలాగే అనేది పెండ్లి కాబోయే అమ్మాయిలంతా."

ఒక పది నిమిషాలు చర్చించుకున్నాము. తరువాత బావ క్లబ్బుకని బయలుదేరినాడు. ఇదే సమయము అక్కయ్యతో సికార్ వెళ్లుతున్నానని చెప్పి ఒక చిన్న నవలచేతపట్టుకొని తిన్నగా ఆనంద్ యింటికి, యింటి యజమానురాలికన్న ఎక్కువ ధైర్యముగా పోయాను. వాకిలి తెరచియుంచబడినది. ఆనంద్ తెల్లటి పైజామా, గ్లాస్కోలాల్చి, ఆకుచెప్పులు, అచ్చంగానేను కలలోచూసిన డ్రస్సులో వాలుకుర్చిలో మేనువాల్చి అప్పుడేవచ్చిన పత్రిక కాబోలు తిరగవేస్తుయున్నాడు.

లోపలికి అడుగుపెట్టి, మెల్లగా ఒక పాడి దగ్గు దగ్గాను.

(సశేషము)

# మానవుని స్వభావమును మార్చుటెటుల?

మూలము :
"అవతార్"
శ్రీ శివానంద భగవాన్
శివానందనగరం

అనువాదము :
"శివానంద పాదసేవక్"
శ్రీ స్వామి శ్రీనివాసానంద సరస్వతీ
శివానందనగరం

దుశ్శీలు (bad characters) రెవరో వారిని గౌరవింపుము. దుర్మార్గుని తొలుత సేవింపుము. వానిని భావిమహాత్మునిగ, సత్పురుషునిగ, స్వయముగ భాగవతుని (saint) వలె నాదరింపుము. నీ హృదయమును పవిత్ర మొనర్చుకొనుటకు, వాని నుద్ధరించుటకు కూడ నిదియొక మార్గము. జాగ్రత్తగ నిట్టి మనుజుల సేవించుటలో నేను ప్రత్యేకపు సంతసము గొందును. నేను సదా నా చుట్టుప్రక్కల నన్ను దూషించు, నన్ను తిట్టు, నన్నవమానపరచు, నింకను నాకు హానియొనర్చ యత్నించు నెంతటి జనసంఖ్యనైనను నుంచుకొందును. నేను వారిని సేవించి, వారిని శిక్షిత (educate) మొనర్చి, వారిని యున్నతపరిచి పైగా వారిని మార్పు చెందించగోరుదును. నేను వారిని మిక్కిలి గౌరవనీయ పదములలో సంబోధింతును. టక్కరి (కపటవర్తనుడు)ని లేదా దొంగను మహాత్మునిగ శ్లాఘించి వానిని బాహాటముగ సత్కరించుము - వాడు తన దుష్ట చెయిదముల (evil doings) కొనసాగింప సిగ్గుపడును. మొండిగ నొక ముక్కోపి మనుజునికి "నీవొక శాంతమూర్తి (ప్రశాంత మనుష్యుడు) వని చెప్పుము. అతడు తన (చీదర) స్వభావమును వినష్టమొనర్చుకొనుటకుగాను సిగ్గుపడును. సోమరి మానవుని "నీవొక చకచకలాడే (చురుకైన) కార్యకర్త" వని పిలువుము - అతడు తన మందగొడి (సోమరి) తనమును త్రోసిపుచ్చి సేవలో మునుగును. ఇదియే నా పద్ధతి. నీ హృదయముయొక్క స్వతః అంతర్యము నుండి యీ శ్లాఘింపు రావలెను. ప్రతి పదమునకు నీవు నీయొక్క ఆత్మశక్తి నొసగవలయును. నీవు మనఃపూర్వకముగ చూపట్టు ప్రతికూల స్వభావము వెనుక మానవునిలో విరాజమైన ననుకూలమగు సుగుణము దాగియున్నదని యనుభవ మొందవలయును. అప్పుడు మీరిరువురును ప్రయోజన మొందుదురు.

హరిః ఓమ్ తత్సత్!

---

# శ్రమలేని వంట

దానంతట అదే కావల్సిన సమయానికి వెలిగి వంట పూర్తిఅయిన తర్వాత ఆరిపోయే "గాస్ స్టవ్" ఒకదానిని పశ్చిమ జర్మనీలో తయారుచేశారు. దీనిలో అన్నిరకాల వంటలూ చేసుకోడానికి సౌకర్యాలు ఉంటాయి. ఈ స్టవ్‌లో ఏర్పాటుచేసిన "ఎలక్ట్రానిక్" పరికరాల సహాయంతో ఇంటి ఆవిడ దగ్గరుండవల్సిన అవసరం లేకుండా, ఏ పదార్థం ఎంతసేపు ఉడకాలో అన్నీ తగిన ఏర్పాట్లు చేసుకుని, ఆ పదార్థాలని స్టవ్‌మీద పెట్టి గడియారంలో ఎన్ని గంటలకి వంట కావాలో ఆ మీటలు నొక్కి వెళ్ళిపోతే, తిరిగి వచ్చేసరికి వంట యిసిద్ధంగా ఉంటుంది.

# అహోహ

## శ్రీ పి. తిరుపతిరావు

(గత సంచిక తరువాయి)

—❋—

ఏమిటీ కొండపల్లి బొమ్మల్లా మౌనం వహించారు? అన్న బసవరాజుగారి మాటకు అల్లుడు సుబ్బారావ్-

"చల్లకొచ్చి ముంత దాచడమెందుకండీ! మామగారు మీరు పెద్దవారు. మాబోటి కుర్రవాళ్ళకు బుద్ధి చెప్పవలసిన మీరే యిలా చేస్తారనుకోలేదు!" అన్నాడు

"చెయ్యడం ఏమిటయ్యా! సంగతి చెప్పకుండా-నేనేం చేశాను."

"ఏం చేశారని అంటారేమిటి? శకుంతలా, ఆ వుత్తరం యేది?" అని సుబ్బారావ్ శకుంతల దగ్గర కెళ్ళాడు. శకుంతల చరచరా అన్నగారి చేతిలోవున్న వుత్తరాన్ని తీసుకొని సుబ్బారావ్ కిచ్చి ప్రక్కనున్న గదిలోకి వెళ్ళిపోయింది —

ఈ పరిస్థితి బసవరాజుకు అగమ్యగోచరంగా వుంది. ఆశ్చర్యంగా అల్లుడి చేతిలోవున్న వుత్తరాన్ని అందుకొని మడత విప్పి చదవసాగాడు —

అధికారం చేతిలో ఉందికదా అని పెద్దవాళ్ళ యిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తారు. వాళ్ళది పాషాణ హృదయం - అవును చేసుకుంటాను నా యిష్టం అని మొండికేస్తే ఏం చెయ్యడం! ఏం చెయ్యాలి? ఈ ఆలోచనలు శ్రీపతి మెదడ్లో రైళ్లులా పరుగెత్తసాగాయి -

మామగారి నోటినుంచి యేంమాట వస్తుందా అని తదేకంగా చూస్తున్నాడు సుబ్బారావ్ —

ఆ వుత్తరం ఆమూలాగ్రంగా చదివి ఒక్క నవ్వు నవ్వాడు. కాని ఆ నవ్వులో ఏం భావం కనిపించకుండా వుండడానికి ప్రయత్నించాడు బసవరాజు — కాని ఏదో ఒక భావాన్ని వ్యక్తంచేయడం తన విద్యుక్తధర్మం అని కోపాన్నే చూపించింది అతని ముఖం. ఉత్తరం మడచి జేబులో పెట్టుకొని.

"ఊఁ ఏమంటారోయ్ మీరు. బాగుంది. దండయాత్ర లేవదీశారన్నమాట. అవును. నేను వాళ్ళమ్మాయిని చేసుకుంటానని చెప్పలేదు. వాళ్ళనాన్న నా దగ్గరకొచ్చి అడిగాడు. ఊఁ అన్నాను. తప్పా-చెప్పండి - మాట్లాడరేం? నే చేసింది తప్పా?...

బసవరాజుగారి నోటంట వచ్చిన మాటకు, సుబ్బారావ్ కి శిఖరాగ్రాన్నుండి దొర్లిపోయినట్లయింది.

"ఏం మాట్లాడవేమోయి! - వకాల్తా పుచ్చుకున్నావుగా బావగారికి."

మొండికెత్తిన మామగారి సమాధానానికి — సుబ్బారావ్ గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్లయింది. మాట్లాడలేక సోఫాలో కూలబడిపోయాడు.

"ఏరా శ్రీపతి, నే చేసింది తప్పా?" అంటూ బసవరాజు కొడుకు దగ్గరకు వెళ్ళాడు. కోర్టులో ముద్దాయిలా శ్రీపతి తలవంచుకున్నాడు.

"శకుంతల — శకుంతల" అన్న తండ్రి పిలుపుకు శకుంతల ఖంగారుపడుతూ వచ్చి ఎదుట నిలబడింది.

పరిస్థితులు ఏవిధంగా పరిణమిస్తాయో — ఎవరికీ ఏమీ అర్థం కావడంలేదు. యేదో ప్రళయం సంభవించే సూచన సూచిస్తోంది ఆ భయంకర నిశ్శబ్ద వాతావరణం.

"ఏవమ్మా నేనొక మాట అడుగుతాను. మీరు సరైన సమాధానం చెప్పండి" అన్న తండ్రి మాటకు— శ్రీపతి దడదడలాడే గుండెతో గోడకు చార్లబడ్డాడు. కిక్కురుమనకుండా సుబ్బారావ్, సోఫాలో సోలిపోయి పరిస్థితులకు కళ్ళప్పగించి వచ్చే ఫలితంకోసం ఎదురుచూస్తున్నాడు -

"అమ్మా. మీరిద్దరూ చిన్నపిల్లలు. ఊహ తెలియని మీ వయస్సులో — మీ తల్లి మీయిద్దరిని నాకప్పచెప్పి - మనల్ని అన్యాయంచేసి ఈ లోకంనుండి వెళ్ళిపోయిన దగ్గరనుండి నా సుఖాన్ని త్యజించి — కళ్ళల్లో జ్యోతుల్లా చూచుకుంటూ, నా యవ్వనం, నా సౌఖ్యం అంతా మిమ్మల్ని పెంచి పెద్దవాళ్ళను చేయడానికి ధారపోశాను. మీరే నా భాగ్యం అని తలపోశాను. యేదోవిధంగా కాలం గడచిపోయింది. ఇంతవరకూ మీకోసం త్యాగం చేసినవాణ్ణి - నే నీ పని చేయటం తప్పా?... చెప్పమ్మా."

శకుంతల ఏమీ మాట్లాడలేకపోయింది.

"ఏరా శ్రీపతి - మాట్లాడవేం?... నే చేసింది



తప్పా?... మీరు కుర్రాళ్ళు-పుత్రోత్కం ఒకటే మీలో

ప్రవహించేది. ఇన్నాళ్లు మీ సౌఖ్యంకోసం, మీ ఆనందంకోసం తన జీవితపు ఆఖరి రక్తపు చుక్కలు ధారపోసిన - నీ తండ్రి యీనాడు తన సుఖంకోసం. ఈ పని చేయడం తప్పా ? మాట్లాడరేం ?"

"పెద్దలు మీ మాటకు యెదురు చెప్పటం తప్పే గాని" యేదో చెప్పబోయిన సుబ్బారావును మధ్యలో ఆపు చేసి.

"సుబ్బారావ్! కాని - అర్ధణా తీసెయ్యి - నేను వెళ్లి - ఆ అమ్మాయిని యిమ్మని అడగలేదు. అసలేం జరిగిందో చెప్పుతా యిలా రా - అమ్మాయి నీవుకూడా యిట్రారా" శకుంతల - సుబ్బారావ్ బసవరాజుని అనుసరించి వరండాలోకి వెళ్లారు.

నాన్న మొండిపట్టు బట్టాడు. నాన్న సుఖం కోసం - భారతి జీవితాన్ని అధోగతి చెయ్యడమా ? అవును చిన్నతనంనుండి ప్రేమతో పెంచిన తండ్రి మాట తప్పక శిరసావహించాలి. తప్పదు. కాని పాపం భారతి అన్యాయమైపోతుంది. యేం చెయ్యడం? ఎటూ తేల్చుకోలేక సందిగ్ధావస్థలో - కాలు కాలిన పిల్లిలా అటుయిటు తిరుగుతూ బాధ పడుతున్నాడు శ్రీపతి.

ముగ్గురూ లోపలికి వచ్చారు.

"ఇప్పుడు చెప్పండి, నే చేసింది తప్పా ?

సుబ్బారావ్ _ శకుంతల - లేదన్నట్లు - మౌనంగా తలూపారు. బావని - చెల్లెల్ని చూచిన శ్రీపతి పై ప్రాణం పైనే పోయినట్లనిపించింది.

"ఏం తప్పలేదు నాన్నా _ తండ్రికోసం త్యాగం చెయ్యవలసిందే - కాని...మీరే ఆలోచించండి - ఆ అమ్మాయి బ్రతుకు...అన్న" నసుగుతూ అన్న శ్రీపతి మాటకు - బసవరాజు

"అయితే ఆ అమ్మాయి జీవితం నాశనమౌతుందని నీ కిష్టంలేదు. అంతేనా ?" అన్న బసవరాజు మాటకు - శ్రీపతి

"కా...కాదు. యింకెవరయినా అయితే బాధ పడేవాణ్ణి కాదేమో !" అంటూ తండ్రి ముఖం చూడ లేక తలవంచుకున్నాడు శ్రీపతి.

"అయితే - ఆ అమ్మాయి నీకు తెలుసా ?" కళ్లద్దాల వెనుకగా కూతురిని, అల్లుడిని హాస్యంగా చూసి అన్నాడు బసవరాజు.

"నాన్నా — క్షమించండి...మీరు మరోలా భావించకండి...ఆ...ఆ...అమ్మాయిని ప్రేమించాను" అన్నాడు బాధపడుతూ శ్రీపతి.

"అఁహాఁ ప్రేమ వ్యవహారాలలో దిగావన్న మాట_ఒరే శ్రీపతి ! యేది యేమైనా ఆ అమ్మాయి యీ యింటి మహాలక్ష్మి కావాలి. యిదే నా నిశ్చయం. మీకిష్టం వున్నా, లేకపోయినా సరే !" అంటూ కోపంగా బసవరాజు ప్రక్కగదిలోకి వెళ్లాడు.

శ్రీపతి దీనంగా చెల్లెల్ని, బావని చూచాడు. "శకుంతల, నాన్న మొండిగా ప్రవర్తిస్తున్నాడు. తన తండ్రికోసం - సుఖంకోసం - తాను త్యాగం చెయ్య వలసిన ధర్మం వున్నా _ భారతి సౌఖ్యంకోసం - వ్యతిరేకించక తప్పు"దన్న శ్రీపతి మాటకు శకుంతల- సుబ్బారావు విరగబడి నవ్వారు.

ఆ నవ్వు అర్ధంకాని శ్రీపతికి వాళ్ళపై కోపం వచ్చి "ఎందుకలా నవ్వుతారు" అన్నాడు గట్టిగా.

నవ్వులు - ఆగాయి.

"నేను భారతిని చేసుకుంటాను. యేది యేమైనా సరే!" అని పిచ్చిగా అరిచాడు శ్రీపతి.

"చేసుకో" అన్నాడు హాస్యంగా సుబ్బారావ్.

"ఏమిటా వెళాకోళం" ఎలక్కి ప్రాణం పోతుంటే - అంటూ శకుంతల ఉడికించింది.

"వెళాకోళం కాకపోతే మరేమిటి ! మీ నాన్న మాత్రం ఏమన్నాడు. ఆ అమ్మాయి ఈ యింటికి మహాలక్ష్మి కావాలన్నాడు. ఈ యింటి దీపమవ్వా లన్నాడు. ఆ మాటల్లో తప్పేముంది ?" అంటూ నెమ్మదిగా మాట్లాడాడు సుబ్బారావ్.

"ఏమీ అర్ధంకాక ఒక నిముషంసేపు మాట్లాడని శ్రీపతి, "మరి భారతి వుత్తరం" అన్నాడు ఆశ్చర్యంగా.

"అంతా అపోహ" అని గాంభీర్యంగా విని పించింది ప్రక్కగదిలోంచి బసవరాజు గొంతు.

"ఒరే శ్రీపతి ! నీ తండ్రి నీవనుకున్నంత నీచుడు కాడు. నీవు ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నట్లు నాకు తెలుసు. తన బిడ్డల సుఖంకోసం _ తన సుఖాన్ని విసర్జించిన నీ తండ్రి - నీ ప్రేమకు అడ్డురాలేదు. భారతి తండ్రి మన యింటికొచ్చినప్పుడు పెళ్లి విషయం చర్చించాడు. నీ విషయం తెలుసుకొన్న నేను - "మీ అమ్మాయి మా యింటికి రావడంలో

"అభ్యంతరమా" అని ఛలోక్తిగా అన్నా – అదే ఈ అపోహకు దారితీసింది.

"మరి యిప్పుడు నామీద" మాటలురాక తడుముకుంటూన్న శ్రీపతి మాట మధ్యలో "నటన" తన కొడుకు ఆత్మధైర్యం పరీక్షించడంకోసం తండ్రి ధరించిన పాత్ర యిది అన్నాడు సుబ్బారావ్ తల గోక్కుంటూ.

"నాన్న" అంటూ ఒక్కసారి తండ్రిని కౌగలించుకొన్న శ్రీపతిని వీపుపై తట్టుతూ –

"పిచ్చివాడా! ఇప్పటికైనా ఈ నాన్నను అర్థం చేసుకుంటే సరి!" అన్న బసవరాజు మాటకు-

"మొత్తానికి నటులనిపించారు మామగారు" అన్నాడు సుబ్బారావ్ ఛలోక్తిగా –

"అనిపించడమేమిటోయ్. కనబడుతుంటే, యిప్పుడు అలవాటు తప్పిందికాని యిరవై యేళ్ళ అనుభవం మరి" కూతురువంక క్రీగంటిగా చూస్తూ –

"మీరు మాత్రం తక్కువవారా? మీ పాత్ర మీరు నిర్వహించారుగా" అన్న శకుంతల మాటకు సుబ్బారావ్ నవ్వి –

"నువ్వు రెండు పాత్రలు, ఏమీ తెలియకుండా నటించి, పైగా నంగనాచిలా నామీద ఆ నింద వేస్తావేం" అన్నాడు సుబ్బారావ్.

"అదేమిటి?" శకుంతల ఆశ్చర్యంగా.

తెరవెనుక సన్నివేశాన్ని కల్పించిన - కవిగా - తెరముందు నటీమణివిగా – మాటల మధ్యలో నవ్వుకుంటూ బసవరాజు క్రిందకుదిగి వెళ్ళిపోయాడు.

"మీరంతా కలిసి నా ప్రాణాలు తీశారు" అన్నాడు శ్రీపతి చెల్లెలి చెవిని మెలిపెట్టుతూ.

"అదిసరే బావగారూ! మీ పెండ్లికి కనీసం భోజనానికి పిలుస్తారా?" అని హేళనచేసిన సుబ్బారావ్ మాటకు సమాధానం చెప్పలేక –

"మీకు నమస్కారం పెడ్తాను" కొంచెం... అంటూ వెళ్ళబోయి ముందున్న కుర్చీ తగిలి బోర్లపడ్డాడు శ్రీపతి -

శకుంతల – సుబ్బారావ్ ఒక్కసారి నవ్వారు. శ్రీపతి ఆ బాధను తట్టుకొని తను నవ్వడం ప్రారంభించేసరికి శకుంతల ఎక్కిరించింది. కోపంవచ్చి లేచి కొట్టబోయేసరికి త్వరగా క్రిందకు పారిపోయింది. ఇద్దరూ నవ్వుకుంటూ శకుంతల వెళ్ళిన దిక్కుకే వారు వెళ్ళిపోయారు.



# ఊహాజగత్తు:

ఊహాజగత్తులో ఒక నాడు మానవాతీతంగానూ అసాధ్యంగానూ కనపడిన అనేక విషయాలు, అనతికాలంలో మానవుని హస్తగతమై నగ్నసత్యాలు కావడం అందరికీ తెల్సినదే. నేటికల రేపు నిజంకావచ్చు. పశ్చిమ జర్మనీలో హాగెన్ వద్ద సరికొత్తగా కనిపెట్టిన నూతన వింతవస్తువుల ప్రదర్శనం సందర్శించిన వారికి యిటువంటి భావాలే స్ఫురిస్తాయి. ఈ ప్రదర్శనంలో ఉన్న ఎనిమిది వందల సరుకులో, వీటిని కనిపెట్టడం సాధ్యమేనా అని ఆశ్చర్యం కల్గించేవిగాఉన్నాయి. వింత వింతవస్తువులు కనిపెట్టడానికి దేశదేశాలలో మేధావులు చేసిన కృషి యీ ప్రదర్శనంలో గోచరమయింది. కుతూహలంతోనూ, సరదాకోసం సరుకులు కనిపెట్టేవారు, కొత్తసరుకులు, పరికరాలు, వాణిజ్యయోగ్యంగా రూపొందించి లాభంపొందాలన్నవారో, తదితరులో, ఎందరో యీ ప్రదర్శనంలో పాల్గొన్నారు.

ఈ ప్రదర్శనంలో సరుకులు కొన్ని మచ్చుకి వివరిస్తారు. పోస్టుబిళ్ళలకి జిగురురాసి, కవరు అంటించడానికి తడి చేసి, పోస్టుబిళ్ళ కవరుకి అంటించి, మనచేతికి అందించే ఒక పరికరం ఈప్రదర్శనంలో ఉంది. అవసరమయితే పెన్సిల్ చెక్కేమరకూడా దీనికి చేర్చుకోవచ్చు. యుగోస్లావియాకి చెందిన వ్లాడిమార్ అనే అతడు అనేక రంగుల కలయికవల్ల ఏర్పడినఒక రంగుని ఏ యేరంగులు కలిపి తయారు చేసారో సవిస్తరంగా చెప్పగల యంత్రం ఒకటి కనిపెట్టాడు. ఆ యంత్రంతోపాటు ప్రపంచంలో అన్ని ప్రాంతాలలోనూ టైము చెప్పగలయంత్రం కూడా, దీనితో కలిపి ఏర్పాటు చేశాడు. అంటే ఆ యంత్రం, ఆకాశంలో కనపడే నీలి రంగులో ప్రధానంగా తెలుపు, నీలి రంగు, కలిసాయని చెప్పడం మాత్రమే కాక, అమెరికాలోని లాంగ్ బీచ్‌లో అప్పుడు టైము ఎంత అయిందోకూడా చెబుతుంది.

అపాయం సూచించే కొత్త రకం హెచ్చరిక పరికరం ఒకటి దీనిలో ప్రదర్శించారు. అవసరం వచ్చినప్పుడు దీనిలో గాలి కొట్టి కావల్సిన చోట తగిలించవచ్చు. దీనిలోపల బేటరీ లైటు ఏర్పాటు చేశారు. కారు పాడయినా, ప్రమాదం జరిగినా, లేదా, వేరేదయినా ప్రమాదం వచ్చినా, దీనిని తేలికగా ఏర్పాటు చేయవచ్చు. దీనిని పెద్దఫాయాలో ఉత్పత్తిచేయడానికి ఇరవయివేల డాలర్లు యిచ్చి ఒక ఫ్రెంచి కంపెనీ లైసెన్సు పొందింది. మరొక వింతవస్తువు - ప్రపంచంలో ఉన్న రేడియోలన్నింటికన్నా చిన్న రేడియో. దీని బరువు ముప్పయి గ్రాములు. అంటే సుమారు మూడుతులాలు. ఖరీదు 12.5 డాలర్లు. దీనిని చాల మంది స్త్రీలు తమ చెవులకి ఒక ఆభరణంలా ఉపయోగించుకుంటున్నారు. ఫ్రాంక్‌ఫర్ట్‌నగరంలో కువర

(522 వ పేజి చూడుడు)

# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

(గతసంచిక తరువాయి)

"వివాహం హిందూ పద్ధతిలో జరిగినా అలంకరణ బెంగాలీ పద్ధతిలో చేయడంలో తప్పేమిటి?" అంటూ నీలిని తీసుకుని తిరిగి పైకి వెళ్ళిపోయింది.

ముహూర్తం సమయమైంది. పండితుల వేద ఘోష ప్రారంభమైంది. పౌరహితుడు తెరకట్టి మండపం దగ్గర కూర్చున్నాడు. పెళ్ళికి వచ్చిన పెద్దలందరూ యెవరి స్థానాల్లో వాళ్ళు కూర్చున్నారు. పౌరహితుడు పెళ్ళికుమార్తెను యెప్పుడు తీసుకురమ్మంటాడోనని కమల నిరీక్షిస్తోంది. ఆడవాళ్ళందరూ మండపంచుట్టూ చేరారు. వాళ్ళలో పెళ్ళి చూద్దామన్న ఆనందంకన్న పౌరహితుని వేషంచూద్దామన్న కుతూహలం యెక్కువై ఒకరినొకరు తోసుకుంటున్నారు. ఇంతలో వధువును తీసుకురమ్మనమని పౌరహితుడు ఆజ్ఞ యిచ్చాడు. ఈ వింత వేషంలో వున్న పౌరహితుణ్ణి చూస్తుంటే పీటలమీద కూర్చున్న యామినీ బాబుకు అసహ్యంవేసింది. కాని యేంచేస్తాడు! అది నిరుపమ కోరిన కోర్కె. ఆ కోర్కే ఆజ్ఞగా శిరసావహించాడు. వధువును తీసుకురావటానికి కమల పైకి వెళ్ళింది. అందరూ కుతూహలంతో మేడమెట్లువైపు చూస్తున్నారు. కమల పెళ్ళికూతుర్ని తీసుకువచ్చి మంటపంలో కూర్చోబెట్టింది. యామినీబాబు ఆజ్ఞప్రకారం పౌరహితుడు పెళ్ళి అంతా అర్ధగంటలో ముగించేశాడు.

వివాహం అయిపోయింది. ఇక మిగిలివున్నదల్లా శోభనం మాత్రమే. అదికూడ వెంటనే కానిచ్చేహడావిడిలో వున్నారు అంతా. కమల పెళ్ళికూతురును పైన గదిలోకి తీసుకువెడుతూ, యామినీబాబును వెనుక రమ్మనమని చెప్పి, ఆడవారినందర్నీ పైకి ఆహ్వానించింది. పైనకూడ పెళ్ళివేదికలాంటిదేమరొకటి. మరొక పౌరహితుడు వుండటంచూచి యామినీ బాబుకు కొద్దిగా ఆశ్చర్యమేసింది. పౌరహితుడు చిరునవ్వు నవ్వి, "ఇదిమాతృదేవి పూజా వేదిక నమస్కరించండి" అన్నాడు. యామినీబాబు నమస్కరించాడు. ఇంతలో కమల పెళ్ళి కూతుర్ని యెదురుగావున్న గదిలోకి తీసుకువెళ్ళింది. వెనకాలే యామినీ బాబుకూడ వెళ్ళాడు. గదినిండా ఘుమఘుమల వాసనలు దిమ్మెత్తిపోతోంది. వధువును మంచంమీద కూర్చోబెట్టి "సుఖంగా యీ రాత్రి గడపండి" అంటూ చిరునవ్వుతో బైటికి వచ్చి గదికి తాళంపెట్టింది. క్రింద వున్న వారందరూ ఆడ మగ విచక్షణలేకుండా పైకి వచ్చేశారు. ఇంతలో గదిలోవున్న యామినీబాబు తలుపు తీయాబోయాడు బైట గొళ్ళెం పెట్టారని గ్రహించి తలుపు తట్టాడు. "మోసం మోసం తలుపు తీయండి" అంటూ గట్టిగా అరిచాడు.

ఈ అరుపులు విన్న కమల కిటికీ తలుపులు తెరిచి "ఏమీ మోసం జరగలేదు. ఆట్టే అరవకు. గూర్ఖా వాళ్ళు యింకాపోలేదు. ఇక్కడేవున్నారు. నీకు న్యాయమే జరిగిందో అన్యాయమే జరిగిందో నీకే బాగా తెలుసు. ఆలోచించుకో" అంది నెమ్మదిగా.

అక్కడ చేరిన ఆడవాళ్ళలో కోలాహలం బయల్దేరింది. "ఏమిటి! ఏమిటి?" అంటూ అందరూ కమలను చుట్టుముట్టారు. మగవాళ్ళలో గుసగుసలు ప్రారంభమైనాయి. ఇదంతా గ్రహించిన కమల అసలు విషయం వారికందరకూ తెలియచెప్పడమే ఉచితమనుకుని జరిగిన కథ అంతా సంక్షిప్తంగా చెప్పింది — "డాక్టరు యామినీబాబుకు పాశ్చాత్యదేశాలగాలి బాగా సోకింది. అలవాట్లు, ఆచారాలు బాగా పట్టుబడ్డాయి. ఆ పద్ధతిలోనే భార్యనుకూడ వెతుక్కోసాగాడు. ప్రొఫెసరు దుబెగారి కూతురు సాలో బి. ఎ చదువుతూవుండేది. పల్లెటూరి పిల్లకాదు. అయినా అంత నవనాగరికురాలుకాదు. యామినీ బాబు లక్నోవచ్చిన తరువాత ఆమెను యెక్కడ చూచేడో యెప్పుడూయేదో వంకమీద వాళ్ళింటికి వస్తూవుండేవాడు. చాల కాలం క్రిందటే దుబేగారు క్రైస్తవమతం అవలంబించాడు. తానుకూడా క్రైస్తవ మతంలో కలియడానికి యామినీ బాబు కూడ మొదట ప్రయత్నించాడు. ఆ విషయమై అతడు ప్రొఫెసరుగారితో అనేకసార్లు చర్చించాడు కూడా. ఆమె కోసం యామినీ బాబు తన మత

ధర్మాన్ని కూడా విడనాడడానికి సంసిద్ధమయ్యాడు. తన కూతుర్ని అతడు ప్రేమిస్తున్నట్లున్నాడని గ్రహించిన దుబేగారు _ అతడికి తన కూతుర్నిచ్చి వివాహం చెయ్యడానికికూడ సిద్ధమయ్యాడు. ప్రేమ కోసం మతాన్ని వదలిపెట్టటం ఉచితమే అనుకున్నాడు యామినీ బాబు. ఈ క్రైస్తవ సమాజంలో చాలమంది స్వతంత్రులు. అందువల్ల వీరిద్దరూ కలిసి తిరుగుతూవుండేవారు. ఈ వీరిద్దరి పరిచయము వారి జీవితాలు పతనమయ్యేటంతవరకు వచ్చింది. దాని పరిణామము - ఆ పిల్ల గర్భవతి అయింది. గర్భవతిగా ఆమెను చూచేసరికి అతడికి అసహ్యం కలిగింది. ఆమెలోని పూర్వపు అందచందాలు అతడికిప్పుడు కనిపించలేదు. ఇదివరకటి హారిణలాలిత్యం హరించిపోయింది. ఒక వింతజంతువులా కనిపించింతనికి. ఇంతలో యోగేష్‌బాబు యింట్లో నిరుపమ తారసిల్లింది. ఆమెలో అందచందాలకు లోటు లేదు. పైగా ఆమె ఆస్తి యెదురుగా కన్పిస్తోంది. ఆ క్షణంనుండి ఊహాసౌధాలు నిర్మించుకోనడం మొదలు పెట్టాడు. డబ్బుకోసం ధర్మాన్ని వదలి పెట్టడానికి తయ్యారయ్యేడు. దాని విషమ ఫలితాలు యెలా వుంటాయో అతడాలోచించలేదు. తర్వాత దుబేగారింటికి వెళ్లడం మానేశాడు. అతడు రాకపోవడంవల్ల ఆమెకంగారుపడి నాకు ఉత్తరం వ్రాసింది. ఏం చెయ్యడానికి తోచలేదు. ఈ విషయం మానాన్నగారితో చెప్పి ఆయన సలహా తీసుకున్నాడు. ఆ అమ్మాయే యీ నాడు అతడిభార్యగా ఆ గదిలోవుంది.'' అంటూ చిరునవ్వునవ్వింది.

అక్కడవున్నవారందరూ ముక్కుమీద వేలువేసుకొని మంచిబాగా జరిగిందన్నారు. అందరూ తనను సమర్థిస్తున్నారని గ్రహించుకొని గంభీరమైన ముఖంతో నవ్వుతూ అంది - ''నిరు కూడ మొదట యింట్లో వాళ్ళమాటలు విని మోసపోయింది. వాళ్లాడించినట్లు ఆడింది. కాని తర్వాత విషయాలన్నీ తెల్సుకుని స్వయంగా ఆలోచించడం మొదలు పెట్టింది. దాని ప్రతిఫలమే యీ నాటి ఆమె పరిణయం'' అంటూ యెదురుగా వున్నగది తలుపులు తెరిచి అందర్నీ ఆశ్చర్యంలో ముంచేసింది. నిరుపమ, కుమార్ పసుపుగుడ్డలతో యెదురుగా కూర్చున్నారు. వీరినందర్నీ చూచి నిరు సిగ్గుతో తలవంచుకుని లేచి నిలబడింది.

వెంటనే యామినీ బాబు గదితలుపులు కూడ తెరిచింది కమల. ఎదురుగా గోడదగ్గిర నిలబడ్డ సుశీలను చూచిన వాళ్లందరూ, చిరు నవ్వుతోనే ఆమెను ఆశీర్వదించి యామినీ బాబుకు మతిపోయిందా అనుకున్నారు. పెళ్ళికివచ్చినవారందరూ ఒక్కొక్కరే వెళ్లిపోసాగారు.

కమల చిరునవ్వుతో యామినీ బాబు కేసిచూస్తూ ''డాక్టర్ కంగ్రాట్యులేషన్స్'' అంది.

యామినీ బాబు కోపంతో చిరచిరలాడుతూ 'థ్యాంక్స్' అని గది తలుపులు దభాలునవేశాడు.

ఆ మరునాడే యీవార్త రామాపురం గ్రామమంతా వ్యాపించింది. అందరూ కరణంగారి యింటి దగ్గర పోగడి ఆయన సలహా కోరారు. ఆయన చిరునవ్వునవ్వి అన్నాడు. ''పిచ్చివాళ్లా రాజుతో వైరం పెట్టుకోనేది. పట్నంలో యిటువంటి వాళ్లు యెంత మంది లేరు. అందరూ యిల్లాగేచేస్తున్నారా ? ... రోజులతో పాటు మనుష్యులుకూడా మారుతూ వుండాలి,''




సాహిత్యసరస్వతి శ్రీ సీరిపి ఆంజనేయులు

(గత సంచిక తరువాయి)

౨

అందుఁ గోదండరామాలయ పార్శ్వ
తలమునఁ బుట్టి యెంతయు నేపుఁగాంచు
వామలూరున వేఁడ్క వర్ధిల్లుచుంటఁ
గడుఁ గ్రూరగతిఁ గ్రాలు 'ఘటసర్ప' మొండు
వివర మార్గము వెంట వెలువడి, దండ
నిండు చందురుఁబోలు నెమ్మోమువాని,
లలిత విశాలలలాటంబువాని,
జిగిఁ దేఱు వాలునాసిక మీఱువాని,
లలినించు కెమ్మోవి నలరించువాని,
డంబైన బ్రవి గడ్డము నూనువాని,
నుక్కఱి యక్కున నిక్కెడివాని,
నసదగు చిఱుబొజ్జ మిసమించువాని,
మేలి పుత్తడిబొమ్మ మెయిడాలువాని,
చిగురులఁ దెగడు కాళ్సేతులవాని,
హాయిగ నిదురించు నా చిన్నవాని
వదనంబునకు నెండవడ సోఁకకుండఁ
దన పడగనువిచ్చి తద్దయుఁ బేర్మి
ఫాలభాగమ్మునఁ బట్టి యిట్టట్టు
నొలసి యాడుచునుండె నుత్సాహపరత.

అత్తఱి నొకఁడు 'నాగాభోగి' యనెడు
పాములవాఁడు, తత్ప్రాంత నివాసి,
యాత్రోవఁ బోవుచు నట కేగుదెంచి,
యాత్మ కొప్పిదమగు నా చిల్వనటన
నివ్వెఱపాటున నిల్చి కన్గొనియె.

అమ్మేడ్కఁ గొంతసే పాఁగి యా భోగి
గణుతించుగతి ఫణాగ్రము నూఁచి యూఁచి,
తన లీలఁ గాంచు నాతని యోల నెంచి,
మనమున బెగడి యవ్వనినుండి మగుడి
మిను చువ్వవడిని+ దిగ్గునఁ బుట్టమెట్టె.
అవ్విధమెల్ల నాగాభోగి కరిది
గొల్పఁగ "నీబాలకుఁడు దశావంతుఁ
డగునేని నాగస్వరాత్మక ఫణితి
నేసల్పు నాద మాలించి యయ్యురగ
మరుదెంచి క్రమ్మఱ నాడెడు నిచట"
నని తలపోసి యయ్యహితుండికుండు

తనదు సొన్నాయి మోవినిఁ జేర్చిపట్టి
వేణుగాన మొనర్చు వెన్నునికరణిఁ
గడు మనోజ్ఞముగ నాగస్వరమ్మూఁదె
గిరిగుహాల్ నినదంబు గిటికొని పర్వ.

ఆ మంజులారావ మాలించునంతఁ
గరిమలఁ గేలించు కాలమేఘమ్ము
నంటి జాఱెడి చంచలాలత పోలె

వల్మీక సదనంబు వదలి సర్పంబు
జఱ జఱ బ్రాఁకుచు సరగున డిగ్గి,
రెండుగడియ లొక్కరీతి నర్తించి,
తనదు బిడారు గొబ్బునఁ బ్రవేశించె.

అంతట మేల్కాంచి యా యర్భకుండు
దళమైన యెట్టని తలపాగవానిఁ,

+మినుచువ్వవడి – ఆకాశబాణవేగము.

గాటుక యలందిన కన్నులవాని,
సాగిన కోరమీసమ్ములవానిఁ,
బూరటిల్లిన తమ్మ బుగ్గలవానిఁ,
చేరిన నునుగెంపు పెదవులవానిఁ,
జిక్కని నెఱకల చిబుకంబువాని,
గాజు పూసలు దండగా వ్రేలువానిఁ,
జుట్టు నడుకు బొంత చొక్కాయివానిఁ,
గరముల బలుజోడు కడియాలవాని,
బటువైన బొటవ్రేళ్ళ బటువులవాని
నేలరాయు షరాయి నెఱవొందువాని,
బెరసైన చిఱులాగు బిగిఁగలవాని,
గలుగల్లుమను కాళ్ళ గజ్జెలవాని,
నెత్తైనవానిఁ దన్నే చూచువాని
నాశ్చర్యచకితు నాగాభోగి వింత
చెలువమ్ము నారసి కలకలనవ్వె.

విదియ చంద్రునికళఁ గొదవగావించు
విధమునఁ దనరు నా విహసితరేఖఁ
గని, మాణవకుని నాగాభోగి జూసి -
"అన్న! దశాయోగ మబ్బిన నీకు
నేమి యిచ్చెదవో నా కెఱిఁగింపు" మంచు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొన, బాలకుండు -
"నే దశావంతుండ నే యాదునేని
పుణ్యాత్మ! చెఱువులుఁ బురములుఁ గొన్ని
నీ పేరఁ దప్పక నిర్మింతు" ననుడు
నచ్చెరువంది, నాగాభోగి మిగుల
మురియుచుఁ గుఱ్ఱనిముద్దాడి చనియె.

(సశేషము)

# తులసీబాయి

శ్రీ ఎ. ఎ. ఎన్. రాజు

మూడువందల సంవత్సరాలనాటి సంగతి. ఒకనాడు ప్రపంచకీర్తి గాంచిన అక్బరు చక్రవర్తి ఆజ్ఞ ప్రకారం రెండువందల మంది మొంగలు సైనికులు రాజస్థాన్ యొక్క సరిహద్దుగుండా గుజరాత్ నకు పోతున్నారు. నూతనంగా సమకూర్చుకున్న వారి ఆయుధాలు సూర్యకాంతిలో 'ధగధగ' మెరసి పోతున్నాయి. ఆ సైన్యానికి నాయకుడు అబ్బాస్ ఖాన్.

అబ్బాస్ ఖాన్ మొంగలు సైన్యాధిపతియొక్క ఏకైక పుత్రుడు. ఆతడు రణరంగానికి పోవటం యిదే ప్రథమం. ఆతడు నాయకత్వం వహించిన సైనికులు కూడ కొత్తవారే. అబ్బాస్ ఖాన్ చాల అందమైనవాడు. ఎల్లప్పుడు సంతోషం ముఖంపై చిందులు త్రొక్కుతూ వుంటుంది. హృదయం వెన్నపూస లాంటిది. ఎవరైనా ఆపదలో చిక్కుకుంటే వాళ్లకు శక్తికొలది సహాయంచేసి రక్షిస్తాడు. "అక్బరు చక్రవర్తికి అపజయం అన్నది లేదు. విజయం తప్పక పొందగలం" అనే దృఢనిశ్చయంతో వారు ముందుకు సాగిపోతున్నారు.

కొంతదూరంలో ఓ పెండ్లిగుంపు సైన్యానికి ఎదురుగా రావటం కనుపించింది. పదునాల్గు సంవత్సరాల వయస్సుగల అమ్మాయిని ఓ ఎనిమిది సంవత్సరాలుగల పిల్లవానికిచ్చి పెండ్లిచేసి, పెండ్లికొడుకు గ్రామానికి పోతున్నారు. ఆ పెండ్లికూతుర్ని ఓ పల్లకీలో నుంచి ఇతరులకు కనబడకుండా చుట్టూ తెరలతో బంధించారు. మందంగా వీచే పిల్లవాయువులను ఆస్వాదించటానికి, ప్రకృతి రమణీయతను చూచి ఆనందించటానికి ఆ అమ్మాయి నోచుకోలేదు.

సూర్యభగవానుడు అస్తమించనున్నాడు. ఆ పెండ్లిబృందం ప్రక్కనే ప్రవహిస్తున్న రోహిణీ నదీ తీరం గుండా పోతుంది. హఠాత్తుగా కొందరు గజదొంగలు ఆ బృందాన్ని బంధించారు. దొంగలను చూచి పల్లకీని మోసే బోయీలు పల్లకీని విడిచి పారిపోయేరు. పెండ్లిపెద్దలు కూడ పల్లకీలోనున్న అమ్మాయి మాట మరచి ఆత్మరక్షణ కొరకు కాళ్లకు బుద్ధిచెప్పారు. పాపం! ఒక్క పెండ్లికూతురే పల్లకీలో వుండిపోయింది. గజదొంగలు పల్లకీతెరలు చించి లోనున్న కన్యను బయటకు రమ్మని హుంకరించారు. ఆమె పేరు తులసీబాయి. గజదొంగలను చూచి వ్యాఘ్రానికి గురియైన లేడిలా "గజగజ" వణికింది. బొంగురుపోయిన గొంతుతో "కెవ్వున" అరచింది. అందాలు చిందే ఆమె ముఖం చూస్తే యెంతటి క్రూర జంతువుకైనా హృదయం ద్రవిస్తుంది. కఠిన హృదయులగు గజదొంగలకు మాత్రం కించిత్తుకూడా జాలి కలుగలేదు. "వెంటనే నగలు వలచి పెడతావా? లేక చిత్రవధ చేయమన్నావా?" అని హుంకరించాడు దొంగలనాయకుడు గండరగండడు.

గజదొంగల నాయకుని హుంకరింపునకు ఆమె శరీరం కంపించింది. మృదువైన ఆమె చేవ్రేళ్లు మెడను అలంకరించిన విలువైన నగలను తీయటానికి ఇష్టపడలేదు. దొంగలకేసి చూస్తూ ప్రతిమలా వుండిపోయింది. ఇంకా జాగుచేస్తే లాభంలేదని దొంగల నాయకుడు బలవంతంగా నగలను దోచుకోటానికి ఉద్యుక్తుడయ్యాడు. వాళ్లు ఆ పని చేయకముందే అబ్బాస్ ఖాన్ ఇరువదిమంది సైనికులతో వచ్చి గజదొంగలను ఎదిరించాడు. కొంతసేపు ఇరుపక్షాలవారికి ఘోరయుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో కొందరు గజదొంగలు అబ్బాస్ ఖాన్ ఖడ్గానికి ఎర అయ్యారు. మిగిలినవారు పలాయనం చిత్తగించారు.

తులసీబాయి తన్ను గజదొంగల బారినుండి కాపాడిన వ్యక్తిని దేవునిలా భావించింది. అంతటి అందమయిన వ్యక్తిని తన జీవితంలో ఎప్పుడు కూడ చూచియుండలేదు. పదునాల్గు సంవత్సరాలు తెరమరుగున గడపటానికే పూర్తిఅయ్యాయి. కలువరేకులవంటి నయనాలనుండి ముత్యాలవంటి అశ్రుబిందువులు కారుతున్న తులసీబాయిని చూచి అబ్బాస్ ఖాన్ మోహపరవశుడయ్యాడు. ఆమెను తన భవనానికి తీసుకొనిపోయి పెండ్లిచేసుకొని ఆనందడోలికల్లో ఊగుతూ, తూగుతూ ప్రణయగీతాలు పాడుకుంటూ ఎంతో హాయిగా కాలం గడపవచ్చునని మనస్సులో

అనుకున్నాడు. వెంటనే చక్రవర్తియొక్క పవిత్ర కార్యం అతని స్మృతిపథంలో మెరిసింది. అందమయిన అమ్మాయి కొరకు పవిత్రమయినటువంటి అక్బరు చక్రవర్తి ఆజ్ఞను అణగత్రొక్కటానికి ప్రయత్నించటం చక్రవర్తి కేదో ద్రోహం చేసినట్లవుతుం దని భావించాడు. కొంతసేపు ఆలోచనలో నిమగ్ను డయ్యాడు. చివరకు అక్బరు చక్రవర్తి ఆజ్ఞను తప్పక శిరసావహించాలనే నిశ్చయానికి వచ్చాడు. ఇంతలో ఆత్మరక్షణకు నలుదిక్కులకు చెదరిన పెండ్లిపెద్దలు, బోయీలు, బంధువులు అక్కడకు చేరారు. తులసీ బాయిని దొంగలనుండి కాపాడినందుకు అబ్బాస్ ఖాన్‌కు ధన్యవాదాలు అర్పించారు.

అబ్బాస్‌ఖాన్ పెండ్లి బృందానికి సహాయకారిగా కొంతవరకు వెళ్లాడు. తెరలమాటున నున్న తులసీ బాయిని చూట్టానికి అబ్బాస్‌ఖాన్ ఎంతో ప్రయత్నించాడు. ఫలితం శూన్యం. తులసీబాయి తన్ను రక్షించిన అబ్బాస్‌ఖాన్‌ను తెరల మాటునుండి మాటిమాటికి చూడసాగింది. ఆమె హృదయఫలకంలో అతని చిత్రాన్ని చిత్రించుకుంది. అందమయిన సిపాయితో కాక పనిబాలునితో తను జీవితం ఎట్లు గడపటమో అనే ఆలోచనలో పడి సతమతమయింది.

ఆ పెండ్లిబృందం వేరొక మార్గం పోయే కూడలి వచ్చింది. అబ్బాస్‌ఖాన్ తులసీబాయి పల్లకీవైపు చూస్తూ చేయివూపాడు. తులసీబాయి తెరను తొలగించి తన్ను కాపాడినందుకు బహుమాన సూచకంగా తన వ్రేలిని, అలంకరించివున్న వజ్రపుటుంగరాన్ని జారవిడిచింది. పల్లకీ ముందుకు సాగిపోయింది.

ఒక సంవత్సరం గడచిపోయింది. అబ్బాస్‌ఖాన్ గుజరాత్ యుద్ధంలో విజయంపొంది ఏకాకియై రాజధానికి తిరిగి వస్తున్నాడు. పంచకల్యాణిపై రోహిణి నదీతీరం గుండా ప్రయాణం సాగిస్తున్నాడు. రణరంగంలో అనుభవాలను నెమరు వేసుకుంటూ ముందుకు పోతున్నాడు. కొంతదూరంలో కొందరు హిందువులు ఓ శవాన్ని స్మశానవాటికకు తీసుకు పోవడం అతడు గమనించాడు. ఏం జరుగుతుందో అన్న కుతూహలం కొద్దీ అతడు ఆ గుంపువెంట బయలుదేరాడు. కొంతతడవుకు ఆ గుంపు స్మశాన వాటిక చేరుకుంది.

ఓ. అందమైన అమ్మాయి చనిపోయిన శవంవద్ద ఏడుస్తూ కూర్చుంది. ఇంతలో అబ్బాస్ అక్కడకు చేరుకున్నాడు. ఆ శవం అమ్మాయియొక్క భర్త అయివుంటాడని అబ్బాస్ ఖాన్ అనుకున్నాడు. ఇక్కడ 'సతి' జరుగబోతుంది కాబోలు అనుకున్నాడు. భర్త చనిపోతే అతనితోపాటు భార్య కూడా ఆహుతి కావాలనేది సనాతన హిందూ ధర్మం. ఒకవేళ భర్తతోపాటు ఆమె ఆహుతి కావాలనే కోరిక లేకపోయినను సంఘపెద్దలు తమ కబంధ హస్తాలతో బలవంతంగా ఆమెను చితిలోనికి నెట్టుతారు.

ఈ దురాచారాన్ని రద్దు చేయటానికి అక్బరు చక్రవర్తి తన శాయశక్తులా ప్రయత్నించాడు. "స్త్రీ యొక్క ఇష్టం లేకుండా ఎవరైనా ఆమెను బలవంతంగా చితికి గురికావిస్తే వాళ్లకు కఠినశిక్ష విధించబడుతుంది" అనే కఠినశాసనం అమలు జరిపాడు. చక్రవర్తియొక్క ఆజ్ఞలపైని, ఆశయాలపైని అబ్బాస్ ఖాన్‌నకు ఎంతో గౌరవం వుంది.

దూరంనుండి ఆ అమ్మాయిని పరికించాడు. స్వతస్సిద్ధంగా ఆమె భర్తతోపాటు ఆహుతి కావాలనే కుతూహలం లేనట్టు గ్రహించాడు. ఇంకా దగ్గరకు పోయి ఆ అమ్మాయిని చూచి ఒక్కమారు నిశ్చేష్టుడయ్యాడు. హృదయం ఆగినంత పనైంది. విచార వదనంతో కూర్చొనివున్న అమ్మాయి ఎవరో కాదు. దీర్ఘమైన పన్నెండు నెలల క్రితం ఒకనాడు రోహిణీ నదివద్ద దొంగలబారినుండి కాపాడిన తులసీబాయి. ఇప్పుడామె భర్తశవం ఎదుట కూర్చొని ఏడుస్తుంది. పాపం ఆమె భర్త జ్వరంతో మరణించాడు.

తులసీబాయికి మాత్రం జీవించాలనే కోరిక హృదయంలో దాగివుంది. సంఘపెద్దలు, సనాతన హిందూ ఆచారాలు వికసించి పరిమళించబోయే జీవితపుష్పాన్ని త్రుంచివేయటానికి కంకణం కట్టుకున్నాయి. ఇంతలో పురోహితులు చితిని పేర్చి అందుపై శవాన్నివుంచి నిప్పు అంటించారు. తులసీబాయి నిలుచుని అంజలి ఘటిస్తుంది. నీల ఆకాశంకేసి చూస్తూ వుండిపోయింది. అబ్బాస్‌ఖాన్ ఆతృతతో "తులసీబాయ్!" అని ఒక్కమారు అరిచాడు. ఆ శబ్దం ఆమె చెవిలో గింగురుమంది. ఒక్కమారు ఎదురుగానున్న వ్యక్తిని చూచి నిశ్చేష్టురాలైంది. ఏ వ్యక్తినైతే యిక తన జీవితంలో చూడననుకుని నిరాశచెందిందో ఆ వ్యక్తే ఎదురుగా కంటబడడం చేత నోటమాటరాక ప్రతిమలా అబ్బాస్‌ఖాన్ కేసి చూస్తూ వుండిపోయింది.

తులసీబాయియొక్క దీనస్థితికి అబ్బాస్‌ఖాన్

హృదయం ద్రవించింది. వెంటనే దగ్గరగానున్న బ్రాహ్మణనాయకుని వద్దకుపోయి అక్బరు చక్రవర్తి యొక్క శాసనాన్ని ఎరుకపరిచాడు. "ఆమె తన భర్తతోసహా ఆహుతి కావటానికి సమ్మతించింది. కావలిస్తే ఆమెనే అడుగు" అంటూ కఠినంగా జవాబిచ్చాడు బ్రాహ్మణనాయకుడు.

"ఏం తులసీబాయి! నీవు భర్తతోపాటు ఆహుతి కావటానికి సమ్మతించావా? అక్బరు చక్రవర్తి శాసనం నీకు తెలియదా? నీ బుద్ధిపూర్వకంగా ఆహుతి కావటానికి సమ్మతించావా? లేక యీ నరరూప రక్కసుల ప్రోద్బలమా?" అని ప్రశ్నించాడు అబ్బాస్‌ఖాన్.

అబ్బాస్‌ఖాన్ మాటలు విన్నతోడనే ఆమె హృదయంలో కొంతధైర్యం చేకూరింది. "ఓ దేవా! లోగడ నన్ను గజదొంగల బారినుండి కాపాడావు. ఇప్పుడు యీ నరరూప రక్కసుల బారినుండి కూడ కాపాడి పుణ్యం కట్టుకో. వారు నా మరణం గురించి యెంతో ఆతృతతో ఎదురు చూస్తున్నారు" అని ఏడుస్తూ పలికింది.

తులసీబాయి రోదనం నలుమూలలు ప్రతిధ్వనించింది. ఒకవేళ అశ్వారూఢుడైయున్న వ్యక్తి తులసీబాయిని అగ్నిబారినుండి కాపాడుతాడేమోనని అక్కడున్న పెద్దలంతా కర్రలు పట్టుకుని ఎదిరించడానికి సంసిద్ధులయ్యారు. బ్రాహ్మణనాయకుడు "బుగ, బుగ" మండుతున్న అగ్నిజ్వాలలలోనికి తులసీబాయిని నెట్టటానికి సంసిద్ధుడౌతున్నాడు.

ఇక ఆలస్యంచేస్తే అమృతం విషం అవుతుందని అబ్బాస్‌ఖాన్ గుఱ్ఱాన్ని అకస్మాత్తుగా తులసీబాయి దగ్గరకు పోనిచ్చాడు. "తులసీబాయ్! వెంటనే నీ చేయి అందించు, లేనట్లైతే యీ నరరూప రక్కసులు నిన్ను బలవంతంగా చంపుతారు" అని అరిచాడు. అంతే తక్షణం తులసీబాయిని తన దక్షిణహస్తంతో గుఱ్ఱంపైకి లాక్కొని ముందుకు దూసుకుపోయాడు. ఆ పంచకల్యాణి వాయువేగంగా గగనంలోనికి ఎగిరిపోయింది. అక్కడున్న పెద్దలు అబ్బాస్‌ఖాన్‌ను ఎదిరించటానికి దమ్ములు చాలక గుడ్లప్పగిస్తూ ప్రతిమల్లా వుండిపోయారు.

భగవంతుని దయవలన స్మశానవాటికనుండి అపాయంలేకుండా సునాయాసంగా బయటపడేసరికి మార్గంలో వేరొక విపత్తు ఎదురైంది. ఇరువురు రాజపుత్ర వీరులు, "ఎవరో నీచుడు స్త్రీని ఎత్తుకుపోతున్నా"డని గ్రహించి అబ్బాస్‌ఖాన్‌ను ఎదిరించారు. అబ్బాస్‌ఖాన్ వాళ్ళిరువురితో ఘోర యుద్ధం చేశాడు. రాజపుత్ర వీరుల శరీరమంతా చిల్లులుపడి రక్తం ప్రవహింపసాగింది. ఇక అబ్బాస్‌ఖాన్‌తో పోరాడలేక ప్రక్కకు తప్పుకున్నారు. పంచకల్యాణి విజయగర్వంతో డెక్కల చప్పుడు చేసుకుంటూ రాజభవనం చేరుకుంది.

అబ్బాస్‌ఖాన్ గుజరాత్ యుద్ధంలో విజయం సంపాదించినందుకు అక్బర్ చక్రవర్తి అతని ధైర్య సాహసాలకు యెంతో మెచ్చుకున్నాడు. అంతే కాకుండా సతికి గురికాబోతున్న ఓ వనితను కాపాడినందుకు అతని ముఖం చంద్రుని చూచిన నల్లకలువలా విప్పారింది. అందుచేత ఆమెను అబ్బాస్‌ఖాన్ పెండ్లి చేసుకోబోతున్నందుకు యేం అడ్డుచెప్పలేదు సరికదా! పైగా యెంతో సంతోషించాడు. అబ్బాస్‌ఖాన్ అక్బరు అభిమానానికి పాత్రుడై క్రమంగా మొగలు సైన్యాధిపతులలో ముఖ్యుడై తులసీబాయిలో ఆనందసాగరంలో తేలియాడుతూ కాలం గడిపాడు.




# పరీక్ష

డి. బి. నారాయణా కృష్ణారావు

బాలలూ! మీరు వీరబల్ పేరును విని ఉంటారు. వీరబల్ యుక్తులు చాలా బావుంటాయి. ఉదాహరణకు ఒకటి చెప్తాను.

వీరబల్ అక్బరు సంస్థానాస్థాన హాస్యగాడు, యుక్తిపరుడు. అతడు అనేకమంది ప్రజల్ని, అక్బరు చక్రవర్తిగారినికూడా నవ్విస్తూఉండేవాడు. అక్బరు అతని సమయస్ఫూర్తికి మెచ్చుకుని చాలా బాగా గౌరవిస్తూండేవాడు. ఈ విషయం, మిగత మహమ్మదీయులకు కన్నెఱ్ఱగా ఉండేది. 'హిందువుడు మహమ్మదీయుని వద్ద ఎక్కువ గౌరవం పొందడమా?' అని.

ఒకనాడు మహమ్మదీయులంతా అక్బరుతో, 'ప్రభూ! ఏమహమ్మదీయ హాస్యగాడు లభించనట్లు తమరు హిందూ హాస్యగానిని, గౌరవించుచున్నారు, మన మహమ్మదీయులలోనే ఒక ఘనమైన యుక్తిపరుడున్నాడు. అతడు వీరబల్‌ను మించినవాడు. మీకు నమ్మికలేకపోతే 'పరీక్ష' చేయండి!' అన్నారు.

అక్బరు అందుల కంగీకరించాడు. ఇద్దరిని 'పరీక్ష' చేస్తునట్లు తన రాజ్యంలో చాటింపు వేయించాడు. సర్వప్రజలు 'పరీక్ష' చూడ్డానికి వచ్చారు. అక్బరు చక్రవర్తి సభలోకి వచ్చాడు. సభయంతా ప్రజా సమూహంతో కిట, కిటలాడుతోంది. సింహాసనము మీద కూర్చొన్నతర్వాత అక్బరు చక్రవర్తి ప్రశ్నించాడు 'ఏమోయ్! ప్రస్తుతం, ఈ సభికుల మనస్సులో ఏముందో చెప్పు?' అని మహమ్మదీయయుక్తి పరుణ్ణి ప్రశ్నించాడు. మహమ్మదీయ హాస్యగానికి కాళ్లు, చేతులూ ఆడక మొహం తెలవేసి తెలీదని వప్పేసుకున్నాడు.

'ఏమోయ్! వీరబల్!... నీవు చెప్పు!' అన్నాడు చక్రవ .

'తమరు ఆయురారోగ్యాలతోను, సర్వ సౌఖ్యంగా, రాజ్యాన్ని పాలించాలనిఉంది' అన్నాడు వీరబల్.

'నిజమేనా' అక్బరు అన్నాడు.

'కాదని ఎవరిచేతనైన అనిపించండి! చూద్దాం!' వీరబల్ అన్నాడు

ఎవరు కాదంటారు.? రాజుగారి సౌఖ్యం కోరరూ? కోరకపోయినా వారి అభిప్రాయం వెల్లడిచేయలేరుకదూ! అంచేత ఊరుకున్నారు. వీరబల్ యుక్తికంతా మెచ్చుకున్నారు. మహమ్మదీయుల గర్వం

(521వ–పేజి చూడుడు)

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౭౧

అఖిల ప్రజావంద్యు – నబ్జాక్షు, నీశుఁ
బూర్ణచంద్ర నిభాస్యుఁ బుణ్యశరీరు
రఘువంశజాతు, స్వర్గాధిపు, వరదు
లక్ష్మణాన్వితు, రఘురామునిఁ దలఁతు.

౭౩

మూడు సంధ్యలందు – ముదముతో నెవ్వరీ
పంచరత్నములను పఠనసేతు
రమలభక్తి, వారి కఖిల పాపంబులు
దొలఁగి మోక్షపదవి దొరకుచుండు

౭౪

ముదమొసఁగు మందరము, రామమూర్తి నాకు ;
ఆర్తిహారియించు సఖుఁడు, శ్రీ మూర్తి నాకు
భువనమోహనుఁ డా రామమూర్తి నాకు
అట్టి, లోక సుందరమూర్తి, నాశ్రయింతు,

౭౫

సదయ చిత్తుండు; శ్రీ పాద సరసిజముల
రంగదుత్తుంగ గంగా తరంగ యుతుఁడు :
సీత చిత్తోత్పలము వికసింపఁ జేయు
చంద్రుఁడు; గుణసముద్రుండు; స్వాంతములకుఁ
ప్రభువు ; శ్రీరామ చంద్రుండు ; భక్తినతని
చింత సలుపుము ; చిత్తమా ! చింతలుడిగి

౭౨

నిత్యంబు నావాణి నిష్ఠతో 'శ్రీరామ
రామా' యనుచుఁ బల్కు నేమముగను,
నిత్యంబు నాచిత్త మత్యంత భక్తితో
రాము పాదంబులఁ బ్రేమఁ దలఁచు,
నిత్యంబు నాదేహమత్యంత ప్రీతితో
శ్రీరామచంద్రుని సేవసలుపు
నిత్యంబు నాజిహ్వయత్యంత ప్రేమతో
జానకీ వల్లభు సంస్మరించు,
జపము సల్పుచున్న – జన్మజన్మాంతర
పాప సంచయంబుఁ బాఱద్రోలి
మోక్ష మొసఁగుచుండు నక్షరద్వయము ; 'రా
మ' మహిమఁ బొగడ, వశమా ? ధరిత్రి.

౭౬

శ్రీ ధనుర్బాణములు గల్గు శ్రీ విలాస !
మానుష శరీర ధారి ! రామా ! ముకుంద !
లక్ష్మణాయుత రఘురామ ! రక్షణంబు
సలుపు మయ్య; సీతాపతీ ! తలఁతు భక్తి.

౭౭

మందహాసంబుఁ గల్గిన మధురభాషి
ఫాల తల విశాలము గల్గు భద్రమూర్తి ;
కర్ణములఁ గుండలములు ప్రకాశముగను
మెఱయు, గండభాగంబులు మెఱయు మూర్తి;

చెవుల పర్యంత ముండెడు జెలువుగనుల
సొబగు మూర్తి; నే శ్రోత్సవస్ఫూర్తి
నొసఁగు
మోహనాకార శ్రీ రాము ముదముతోడ
సంస్మరణఁజేతును; ప్రభాత సమయమందు

౧౯

శివ ధనుర్భంగ మొనరించి, సీతఁ బెండ్లి
యాడి, యడవులలో, నడయాడి, రక్క
సులను జెండాడి, కొండాడుసుజనభక్త
కోటి శాశీస్సులొసఁగెడి మేటి రాము
పాదముల, సేవఁజేతు - ప్రభాత మందు

౨౦

పద్మాంకుశాది, శుభస్కర రేఖ
లానందముననొప్పు - యరవిందచరణ
మకరందమును గ్రోల - మానులమనసు
లను, భ్రమరంబులత్యంత యాసక్తి
సేవింపఁదొడఁగెను శ్రీరామచంద్ర!
నీ పాద పద్మముల్ - నెమ్మి సేవింప,
నాయహల్యకుఁబోయె నేర ! శాపంబు
కాన, నా చిత్తంబు కమలాక్ష! నీచ
రణయుగ్మములఁ బట్టి రక్తివందించు
భజియించుసతము ; ప్రభాతంబునందు.

౨౧

వాక్య దోషముల్, హరియించు ; పరమ
పావ
నాత్మకంబైన నీ నామ మర్థిఁదలఁప
పాప సంఘంబు దూలు; నాభవునిఁబొంద
గౌరినినుఁగూర్చి తపము జక్కగనొనర్చి,
హరునిఁబెండ్లాడె ; శ్రీరామ ! హర్షమలర
వేయి విష్ణునామములతో - విలువగల్గు
రామనామ మొక్కటిచాలు; రక్తినేను
పలుకు చుండెద సతము, ప్రభాతమందు

౨౨

వేదములు, నిన్ను స్తుతియించు - విశ్వరూప!
నీలరత్నోత్పలప్రభల్ - నీశరీర
మందు వ్యాపించె; శ్రీ మానిబృంద
మెపుడు
నినుస్తుతింతురు ; నీ భృత్యులనుదినంబు
ధ్యానమొనరింత్రు, నీ రూపు తమ్మినేత్ర!
ముత్యముల, భూషణములచే - ముద్దుగాఁగ
వెలయుచుందువు శ్రీరామ! వేడ్కనిన్ను
నాశ్రయింతు నుషఃకాలమందు సతము

౨౩

ఈ శ్లోకపంచకంబే నరుండేని
నిత్యంబుఁబఠియించు నిష్ఠఁబ్రభాత
కాలంబునందు, సంకల్ప చిత్తమున
నాతండు పరులకు నందగరాని
విష్ణులోకము జొచ్చు - వేడ్కతో రాము
కింకరముఖ్యుఁడై - కీర్తిని బొందు

౨౪

పెర మంత్రములు ధాత్రిఁబెక్కులున్నవి
కాని
రామమంత్రము సాటిరాదదెద్ది ?
పెరమంత్ర పఠనమందరుదుగానేమైన
లోపంబు గలిగిన లోటువచ్చు
ఆయాసమెక్కువై - కాయంబు శుష్కించు
సంసార దుఃఖాది శ్రమలు గల్గు
"శ్రీరామశ్శరణంమమే - " రామ -
రఘురామ
యంచొప్పు అష్టాక్షరాయుతంబు
నైన శ్రీరామ మంత్రంబు నాత్మఁబఠన
సలుప, సకల మంత్రంబుల ఫలములబ్బు
దోషతతుల, నివారించితోష మొసఁగు
రామ మంత్రంబుసాటి, మంత్రంబుగలదె?

(సశేషము)



# శ్రీ సాయిబాబా మహాసమాధి దినోత్సవ సందేశము (30-9-60)

## స్వామి కేశవయ్యాజీ

**అనుసరణ : శ్రీ సి. సి. పున్నయ్య**



మానవులు సుఖసౌభాగ్యముల నుద్దేశించి పాటుపడుట సహజమైనా స్వీయకృషితో సాధించకలుగునది అశాశ్వతమైనది. సాధారణముగా ప్రాపంచిక సుఖములను మనము ఆనందముగా నెంచి పొరబడుచున్నాము. అట్టివానిని వెన్నంటి కష్టములుండునని గుర్తించుటలేదు. శ్రీకృష్ణపరమాత్మ శ్రీమద్భగవద్గీతా బోధలలోని యదార్థమును "సుఖమెరుగని యీ యశాశ్వత ప్రపంచంలో నీవు నన్నారాధించి తరించుము" అని అర్జునునికి చెప్పెను. ప్రజలలో రాజైనా, సామాన్యుడైనా దివ్యప్రభావము వలన మమకారము, ఇహలోక చింతలు, ఆరాటము నశించి భగవంతున కంకితమైననే నిజమైన సుఖము, ఆనందము చేకూరును. మానవకోటిని దుఃఖములనుండి, ఆపదలనుండి, కష్టములనుండి రక్షించుటకని యుగయుగములుగా అవతారపురుషులు, మహాత్ములు, ఋషులు, భక్తశిఖామణులు జన్మించుచున్నారు. దానిని శ్రీకృష్ణుడు భగవద్గీతలో "ధర్మము పతనావస్థలోనుండి, అధర్మము హెచ్చు పెరిగిపోవునప్పుడు సజ్జనులను రక్షించి, దుర్మార్గులను అంతమొందించి ధర్మస్థాపన చేయుటకు నేను ఎప్పటికప్పుడు అవతారమెత్తుచుందును" అని చెప్పెను. దాని ననుసరించియే యీ యుగంలో షిర్డీపురవాసి శ్రీ సాయిబాబా అవతారము వెలసినది.

శ్రీ సాయిబాబా బాల్యమును గురించి వివరములు అంతగా తెలియకపోయినా ఆయన షిర్డీలో ప్రత్యక్షమయినప్పటికే దివ్యజ్ఞానము, అసమానమైన దివ్యశక్తులతో విశిష్టమైన వ్యక్తిగా రూపొందియుండెను. తనకేదైనా దివ్యత్వము సిద్ధించియున్నచో నది తన బాల్యములోను, చిన్నతనమునందును అత్యంత సన్నిహితుడుగా నుండిన తన గురువు వెంకుస వల్లనే యనెడువాడు. ఆయన నిష్ట, ఓర్పు ఆవశ్యకతను గురించి వక్కాణించుచు వాని నలవరచుకొని ఆచరణలో పెట్టవలసినదిగా భక్తులకు బోధించెడివాడు. శ్రీ బాబా మొదట మూలికలతోను, ఔషధములతోను భక్తుల బాధలను, చింతలను నివారణచేయుచుండెడివాడు. కాని కాలక్రమమున పద్ధతి మార్పుచేసి తనుసిద్ధిపొందిన 'ద్వారకామాయి' మసీదులో నిరంతరము ప్రజ్వరిల్లుచుండు అగ్నియందలి బూడిద (విభూది)తో ప్రజల శారీరక, మానసిక స్వస్థతను కలుగజేయసాగెను. ఆ విభూది నేటికీ, నాటికి అమృతతుల్యమై పతనావస్థలో నున్నవారి నుద్ధరించి రక్షించుచున్నది

శ్రీ బాబా త్రికాలజ్ఞానిగా సత్యము, ప్రేమలను ప్రబోధించినవాడు. నిరాడంబరంగా జీవయాత్రచేయుచు సాధువుగా ఆయన నిరంతరము ధ్యాననిమగ్నుడై యుండెడివాడు. ఆయన జీవితమంతయు మానవసేవకు అంకితము చేసెను. పూర్ణపురుషుడుగా తన ఆధ్యాత్మిక శక్తిని తన అనుయాయుల కుపకరించుటకుగాను అనేక చిత్రవిచిత్రములుగా ప్రదర్శించెను. తన్నాశ్రయించినవారిని ఓదార్చి, ఆనందపరచి విశ్వాసమును కలుగజేయువాడు. శ్రీ సాయిబాబా బోధనలు నిరాడంబరమైనవై విశిష్టమైనవిగా నొప్పెను. భగవదనుగ్రహము నుద్దేశించి వ్యయప్రయాసలతో కూడిన సాధనలను ఆయన భక్తులకు సూచించలేదు. నిర్మలమైన ఆత్మతో భక్తివిశ్వాసములు కలిగి భగవన్నామస్మరణ చేయుట వలన భగవత్సాక్షాత్కారము, కటాక్షము లభ్యమగునని బోధించెను. విచిత్రమైన మానపద్ధతిలో ఆధ్యాత్మిక విప్లవము తెచ్చి అనేకమందిని తన అనుగ్రహమునకు పాత్రులుగా చేసెను. ఈనాటికి సయితము సాయిబాబా భక్తుల దివ్యానుభవములు మనలను పులకితులను చేయుచుండును.

ప్రపంచ పరిస్థితుల దృష్ట్యా మానవోద్ధరణకు శ్రీ సాయిబాబా దివ్యసందేశము శాంతిసౌభాగ్యములను ప్రోత్సహించునట్టిది. శ్రీ సాయిబాబా బోధనలు అనేక వ్యక్తిగత, సాంఘిక క్లిష్టసమస్యల పరిష్కారమునకు అమూల్యమైనవి. ఆ బోధనల సారము "అల్పమయిన, సంకుచితమైనవానిని తృణీకరించి ఉన్నతమైన, విశాలమైనవానిని స్వీకరించుట." ప్రకాశించునదంతయు బంగారు కానట్లు మానవునకు క్రమముగా తనకీ అశాశ్వతమైన దేహము ఎందుకేర్పడినది గుర్తించ కలుగును. శ్రీ స్వామి వివేకానంద కూడ యీ విషయమును "ప్రపంచములో అహం మరచినవారు అనేక ఘన కార్యములను సాధించిరని తెలుసుకొనుటలేదు. అప్పుడే తను ప్రేమించవలసినది అశాశ్వతమైన, అల్పమైనదానిని కాదని తెలిసికొనగలుగును. అప్పుడే తన ఆశయము భగవంతుని ప్రేమించుటకాని, మట్టిముద్దను కాదని తెలిసికొనగలడు. అట్టివానిలో అహం మాయమై, ఆ స్థానమును భగవంతుడాక్రమించి ప్రపంచమునే చలింపజేయు వ్యక్తిగా రూపొందగలడు. అతనికి ప్రపంచము మరొక విధముగా కనుపించును. మానవుని సన్మార్గమునుండి తప్పించు అసభ్యత, తొందరపాటు అంతమొందును, దానితో పెనుగులాట, ద్వేషము, అసూయ వరుసక్రమమున శాశ్వతముగా మరుగుపడిపోవును. "ఈ ప్రపంచమప్పుడు స్వర్గతుల్యము కాగలదు." ఈ మధ్య మద్రాసును సందర్శించిన ఇండియా ప్రెసిడెంటు డా॥ రాజేంద్రప్రసాద్ గౌడీయ మఠంలో జన్మాష్టమి ఉత్సవాలలో నుపన్యసించుచు భగవత్సందేశమును ప్రచారము చేయుటకేర్పడిన సంస్థలు వివిధ మతముల వారిలో సౌభ్రాతృత్వము పెంపొందించుటకు కృషి చేయవలెనని నొక్కి చెప్పుచూ, అట్టి ఉత్సవ సందర్భాలు భగవద్గీతా బోధనలను స్ఫురణకు తెచ్చునవనియు, అవి మానవుని ఉద్ధరించి ముక్తిసాధనకు, భగవత్సాక్షాత్కారమునకు తోడ్పడుననియు, అట్టి సందర్భములలోనైనా మానవుడు అహంను మరువగలడనియు, ప్రాపంచిక చింతలతోటి, వ్యాపకములతోటి విసుగుచెందినప్పుడు ఆధ్యాత్మిక బోధనలు మహోపయుక్తములనియు, మనదేశములో అన్ని మతాలకు, అభిప్రాయాలకు సమానావకాశాలు, రక్షణలుండుట గర్వకారణమనియు, భగవదారాధనా పద్ధతులు వేర్వేరయినా భక్తివిశ్వాసములు ప్రధానములనియు, అవియే మానవుని రక్షించగలవని ఉద్బోధించిరి.

శ్రీ సాయిబాబా మహాసమాధి దినోత్సవంలో పాల్గొనుటకు దేశం నలుమూలలనుండి భక్తులు యీ సమావేశమునకు వచ్చినారు. నలభై రెండు సంవత్సరముల క్రిందట యిదే విజయదశమినాడు శ్రీ సాయిబాబా తన అశాశ్వతమైన దేహమును చాలించి సమాధియయిరి. శ్రీ బాబాలాంటి దివ్యపురుషులు ఆధ్యాత్మిక ప్రపంచమునుండి మరింత ఘనకార్యములు చేయగలరు. ఆయన బ్రతికియుండగానే "నేను సమాధిపొందిన తరువాత సయితము మీరు నన్నెక్కడ తలచుకున్న అక్కడ నేను మీతో నుందును. నా సమాధి, మట్టి మీతో మాట్లాడును. నేను సమాధిలో నిరంతరము చలించుచుందును" అనిరి. ఈ పలుకులు యదార్థములు. అనేకులు బాబాను స్వయముగా చూచి ఎరుగకపోయినను అనేక సందర్భములలో ఆయన పటముముందు భక్తివిశ్వాసములతో భక్తులు ప్రార్థించి ఆశీస్సులను, కార్యసిద్ధిని పొందుచున్నారు. ఇట్టి పవిత్రమైన సందర్భమున మనమందరము ఏకాగ్రతతో బాబాను ధ్యానించి, చిత్తశుద్ధితో ఆరాధించి, మనము పరిశుద్ధులమై, ఉత్తములమై దివ్యత్వమును సాధించకలుగుదుముగాక! మన మీరోజునుండి 'సత్యంవద' సత్యమునే పలుకుట, బీదవారికి, నిస్సహాయులకు సహాయము చేయుట, ద్వేషము, అసూయలకు దూరమై సర్వప్రాణులను ప్రేమించుట, నిరంతరము భగవంతుని ధ్యానించి స్మరించుటలాంటి కొన్ని బాబా బోధనల ననుసరింతముగాక!

శ్రీ సాయిబాబా ఆశీస్సులు ఆయన భక్తులకు లభ్యమై ఆయురారోగ్య ఐశ్వర్యములతో తోడ్పడుగాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః




హిందీమూలము :
శ్రీమతి కమలాదేవి చౌధరీ

అనుసరణ :
'నిర్మల్'

ఉష భర్త ఆమెను ఎంతో మక్కువగా చూచుకుంటాడు. ఆపేటలోని ఆడవాళ్లందరికి ఇదే చర్చనీయాంశము. ఉషకూడా మిగతావాళ్ళందరికంటె తను ఎంతో అదృష్టవంతురాలనని అనుకుంటూ వుంటుంది. తనను తనభర్త ప్రేమించినట్లు, గౌరవించినట్లు, ఇంకెవ్వరి భర్తలు ప్రేమించరు, గౌరవించరు. ఆయన తన్నెపుడు చిన్నచూపు చూడలేదు. పైగా తన కోర్కెలు తీర్చటంలో చేతనయినంత మటుకు వెనుకాడరు.

ఆయనకూడా తన ఉష ఎల్లపుడు కళకళలాడుతూవుండాలనుకుంటాడు. రకరకాల వస్తువులు తెచ్చి, ఆమెను ఆనందపరుస్తూ వుంటాడు, తనతోపాటు సినిమాలకు, షికార్లకు తీసుకుపోతుంటాడు.

స్నేహితురాండ్రు 'ఏదోమంత్రం వేసినట్టున్నావే' అని అంటుంటే, ఉష హృదయం గర్వంతో ఉప్పొంగిపోయేది. పైకిమాత్రం 'ఆఁ, ఇందులో విశేషం ఏముంది? ఎవరిభర్తలు వారి భార్యలనుగౌరవించరూ?' అని అనేదికాని మనస్సులో మాత్రం వారిమాటలు నిజమేకదా అని అనుకునేది. ఆయన తనను ప్రేమించినట్లు, ఎవ్వరూ తమ భార్యలను ప్రేమించరు. అదిమాత్రం యదార్థం. ఒక్కరోజుగాదు గదా, ఒక్క పూటకూడ తనను వదలి వుండలేదు; కనుకనే పుట్టింటికన్నా పంపడు.

2

బీహారురాష్ట్రంలో హరిహరక్షేత్రపు తిరునాళమహాప్రసిద్ధి. దూరదూర ప్రదేశాలనుండికూడా జనం తర్లబడివస్తారు. ఉష, భర్తతోపాటు, ఆ క్షేత్రసందర్శనానికి వచ్చింది.

ఆనాటికి తిరునాళ మొదలై మూడు రోజులయింది. గండకీనదీ తీరాన జనసమ్మర్దం మహా ఎక్కువగానున్నది. సమయం సాయంకాలము. అందరూబోట్లు ఎక్కి నదీవిహారం చెయ్యాలనుకోవటంతో ఎన్ని పడవలువచ్చినా, చాలటంలేదు.

ఉషకూడా తనభర్తతోపాటు ఒక పడవలో కూర్చున్నది. పడవాళ్ళువద్దంటున్నా, ఎంతోమంది తోసుకుంటూ, ఎక్కేశారు. పడవమీద బరువు ఎక్కువై పోయింది. పట్టుదప్పి పడవ, నదీమధ్యంలో వున్న సుడిగుండంవైపుపోసాగింది. దాంతో నావికులు అధైర్యపడిపోయారు. ఇకపడవ మునిగిపోతుండని ప్రకటించి వాళ్లు కాస్త నదిలోదూకేశారు. వారితో పాటు ఈత చేతనయినవాళ్ళంతా దూకారు. ఈ దటం

చేతకానివాళ్లుకూడా, పడవతో పాటు మునిగి చావటంకంటె ప్రయత్నం చేస్తే మేలని నదిలో దూకేశారు.

పడవలో ఉష, ఆమె భర్త మాత్రమే మిగిలిపోయారు. ఆయన ధోవతిబిగించి, దూకడానికి తయారవుతున్నాడు. పాపం! ఉష భీతహరిణిలా, భర్తవైపే చూస్తూ వుండిపోయింది. ఆమె గుండె అదురుతో సమానంగా పడవకూడా గాలికి రెపరెప లాడిపోతున్నది. భయంతో ఉషకళ్లుమూ తలుపడిపోయినవి. ఇదే ప్రళయం. ఇవే ఆఖరిఘడియలు కాబోలనిపించింది.

అప్పటిదాకా తన భర్తను బ్రతికించ మని భగవంతుని ప్రార్థిస్తున్న ఉషకు ఆఖరి సమయంలో భర్తను గుండెలకు హత్తుకొని చావాలనిపించింది. మరణ సమయంలో వేరుగావుండటం ఇష్టంలేక పోయింది.

ఉష రెండు చేతులు చాపి, ముందుకు పోయింది, కాని పాపం ఆమె భర్త, ఉషను చూడనన్నా చూడకుండా, దూకేశాడు. తన ప్రాణాలను రక్షించుకోవటానికి విశ్వ ప్రయత్నంచేస్తున్నాడు. ఉషకండ్లుమూసు కొని పడవలో వ్రాలిపోయింది మృత్యు వునాహ్వానిస్తూ.

దూరాన తీరాన నిలబడ్డ వేలాది జనం, ఈ దృశ్యాన్ని చూశారు మునిగిపోతున్న ఆ స్త్రీని రక్షించమని అందరూ, ఏక కంఠంతో దేవుణ్ణి ప్రార్థించారు.

భగవంతుడుకూడా ఇంతమంది కోర్కెను నిరాకరించలేక పోయాడేమో అన్నటు, పడవ (తేలిక అయిపోవటంతో) మునగలేదు. కొంతమంది సహృదయులు, స్పృహతప్పిన ఉషను ఒడ్డుకుచేర్చారు. ఉషనుచూచి అయ్యో! పాపం! అనేవారే అందరూ. పరమాత్ముని అపారకృపకు నివాళులర్పిస్తూ, ఉషభర్తను హేళన చేయ సాగారు. ఇద్దరుముగ్గురు అననుకూడా అన్నారు - 'మంచి ఈతగాడిలావున్నావే. భార్యను రక్షించుకోవటం నీకర్తవ్యం కాదుటయ్యా!' అని.

పాపం, ఉష చిన్నబోయి భర్తవైపు చూడసాగింది. ఇంతమందిలో ఏమంటుంది! ఒంటరిగా అయితేనా ...... అనవస రంగా భగవంతుడు తననురక్షించాడు: చస్తేబాగుండేది. ఈ బ్రతుకు బ్రతికి మాత్రం ఏం లాభం?

సరేపోనీ- దేవుడు రక్షించనయితే రక్షిం చాడు. ఈ విషయం తమ పరిచితులెవరికీ తెలియకుండావుంటే బాగుంటుంది. కాని కళ్లెత్తి చూస్తే, ఒకరిద్దరేమిటి? తెలిసిన వాళ్లు బోలెడంతమంది కనిపించారు. కళ్ళు మూసేసుకుంది పాపం!

ఒక్క క్షణంలో భవిష్యత్తు అంతా ఆమెకళ్ళముందు నాట్యం చేసింది. తమ ప్రేమనుచూచి కండ్లలోనిప్పులుపోసుకున్న వాళ్లంతా ఇహ సంతోషించగలరు. ఉషను వదలి ఒక్కపూటకూడా వుండలేని మహానుభావుడు ఈయనేనా అని ఈస డిస్తారు - ఛీ! ఛీ!

ఒక వేళ తను చచ్చిపోతే - ఆయనకు దుఃఖం కలగకుండావుండేదా! ఒకటిరెండు రోజులు, వంటరితనం కష్టంగానే అనిపించి వుండేది. కొన్నాళ్ళుపోయింతరువాత మళ్ళీ

పెళ్ళి. ఆమెనుకూడా యిట్లాగే ప్రేమించే వారు కాబోలు. ఛీఛీ! ఏమిటిదంతా— దేవుడు చల్లని చూపుచూసి యిద్దరినిరక్షించాడు. అంతే చాలు ఆయన చేతకాస్తో కూస్తోదాన ధర్మం చేయించాలి ఈ సందర్భంలో.

అనవసరంగా ఆయనను నిందించటం దేనికి? ఈ ప్రపంచంలో స్వార్థభావనలేని ప్రేమ ఎక్కడన్నైనా ఉన్నదా? కాని కర్తవ్యమో? మానవసంఘు కొన్ని కట్టుబాట్లకు, కర్తవ్యాలకు కట్టుబడిలేదా? భార్యను రక్షించుకోవడం భర్తకర్తవ్యంకదూ? ఆc. ముందు తనప్రాణాలు రక్షించుకోవద్దూ? భార్యాపుత్రులు... ఇవంతా మోహబంధాలేకదా! 'ఎవరికి వారే యమునాతీరే!' ఈ మమకారంలోపడి, చేతనయికూడా తన ప్రాణాలు రక్షించుకోకపోవటం ఆత్మహత్య గదూ?... ఏమిటి ఈ ఆధ్యాత్మచింతన అంతా? ఈతర్కం నా చేతకాదు బాబూ! ... స్త్రీకి మాంగల్యమే సౌభాగ్యం. దేవుడు నా భర్తను ప్రాణాపాయంనుంచి తప్పించాడు. అంతే అదేమహాభాగ్యం.'

మనస్సు దిటవుపరచుకొని, లేనిసంతోషం తెచ్చి పెట్టుకొని, లేచి కూర్చుంది ఉష. 'ఇహ యింటికిపదండి. దేవుడు మనల్ని చల్లని చూపుచూశాడు, ఇంక విచారం దేనికి?' అని అన్నదికాని మనస్సులో బాధగానేవుంది. తోడివాళ్ళకేం సమాధానంచెప్పాలి!

4

మృత్యుశయ్యమీద ఉన్నభర్తప్రక్కన కూర్చుని, ఉష కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తున్నది. ఆరునెలలనించి భర్తకు ఒకటే జ్వరం. తగ్గుముఖంమాటేలేదు. 'డాక్టర్లేమో క్షయం అంటున్నారు. ఈ క్షయకు మందులేదా భగవాన్! ... అయితే ... అయితే ... ఏంకానున్నది స్వామీ!' ఇహ ఆలోచించలేకపోయింది. ఉష కన్నీరుమున్నీరుగా ఏడ్వసాగింది. ఇంతలోనిద్రనించిలేచిన పిల్లవాడు 'అమ్మా!' అని పిలిచాడు. ఉష కండ్లు తుడుచుకొని ఒక్కక్షణం కండ్లుమూసుకొని భగవంతుణ్ణి ప్రార్థించింది. ! 'నన్నువంటరిదాన్ని చేయబోకునాయనా!'

పిల్లవాణ్ణి వళ్ళో పెట్టుకొని అనుకున్నది. 'మాయిద్దరి తరువాత వీడిగతి ఏంకాను? వీడికిదిక్కెవరు? భర్త తరువాత, వీడిని సాకటానికి తను బ్రతికివుండాలా?' ఈ ఆలోచనతో మళ్ళీహృదయంలో తుఫాను చెలరేగింది. గొంతుపూడుకుపోయింది. కండ్లు నిండిపోయినవి. శరీరం వణకసాగింది. అరె! ఇదేమిటి? తనేకాదు ఇల్లంతా వణకిపోతున్నదే! భర్త పడుకున్న మంచం కూడా వూగులాడిపోతున్నదే! అదే సమయంలో బయటినించి 'భూకంపం' అన్న కేకలు వినిపించినవి.

రోగిష్టిభర్త 'ఉషా! నాలోలేచేశక్తి లేదు. నా మాట విను. పిల్లవాణ్ణి తీసికొని పారిపో' అన్నాడు.

గాలిదుమారం మట్టి యిసుక ఇంట్లోకి కొట్టుకోవస్తున్నవి. ఇళ్ళు కూలుతున్న శబ్దాలు. కాని భర్తను రక్షించటమెట్లా? ఇంట్లో ఎవరూలేరు. వళ్ళో పిల్లవాడు-

ఇంతలో తమ యింటిగోడ ఒకటి కూలి పోయింది. భర్త 'పారిపో ఉషా! పారిపో!' అని కేకేసాడు.

ఉష పిల్లవాణ్ణి తీసుకొని బయటికిపరు గెత్తింది. భయంతో ఏడుస్తున్న పిల్లవాణ్ణి బయట పడవేసి, మళ్ళీలోపలికి వచ్చింది. ధడధడమనే శబ్దంతో పైకప్పు ఉషమీద ఉషభర్తమీదపడి కూలిపోయారు.

తన పిల్లవాణ్ణి గూర్చి ఆఖరిసారి భగ వంతుణ్ణి ప్రార్థించేందుకన్నా పాపం! ఉషకు అవకాశంలేకపోయింది. భార్యా భర్తలిద్దరు భూగర్భంలో కలిసిపోయారు!

(512 వ పేజీ తరువాయి)

అణగి పోయినది. రాజు సంతోషించి బీర్బల్‌ను ఘనంగా సత్కరించాడు. కావున బాలలూ మీకుకూడ గర్వము ఉండకూడదు!

---

# అంధేరా రాజా - అవకతవక దర్బార్

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని

అనగా అనగ అస్తావ్యస్తపు రాజ్యాన్ని అల్పబుద్ధి అనే రాజు పరిపాలిస్తున్నాడు. ఆ రాజుకు తోచదు, ఒకరు చెబితే ఎక్కదు. తన పంతమే నెగ్గాలంటాడు. ప్రజలు వేగలేక ఎలాగా అని ఆలోచన్లో మునిగిపోయారు.

ఇలా ఉండగా రాజు ఒకరోజున వింతశాసనం ఒకటి చేశాడు. ఆ శాసనం ప్రకారం ప్రజలు పగలు చేయాల్సిన పనులు రాత్రిళ్ళు, రాత్రిళ్ళు చేయాల్సినవన్ని పగలు చేయాలి. అంటే పగలు నిద్ర, రాత్రి పని! అలాగే అన్ని కార్యక్రమాలు. ప్రజలు ఈ శాసనంతో బెదిరిపోయారు. రోగాలు ఎక్కువయినై రాజ్యంలో. ఎదురు తిరిగితే ప్రయోజనంలేక ఎలాగా రాజు కళ్లు తెరిపించటం అని ఎవరిమటుకు వాళ్ళే చూస్తున్నారు.

మొదటి శాసనానికే చస్తుంటే రాజుగారు ఆడవారు చేసేపని మొగవాళ్లు చేయాలని, మొగవాళ్లు చేయాల్సినవి ఆడవారు చేయాలని శాసించాడు!

ఒకరోజున రాజుగారికి కడుపులో నొప్పి వచ్చింది. డాక్టరును పిలచి "ఏమిటో పరీక్షించి రోగనిర్ణయం చేసి మంచి మందును ఇవ్వమ"న్నాడు. ఆ డాక్టరు పరీక్షించి తెలివిగా, "రాజా! మీకే జబ్బు లేదు. కాని మీరు గర్భవతులయ్యారు! మరో 5, 6 మాసాలలో ప్రసవించవచ్చు' అన్నాడు.

ఆ మాటకు రాజు మండిపడి ఆ డాక్టరును బంధించమని ఆజ్ఞ ఇచ్చాడు.

అప్పుడా డాక్టరు, "రాజా! పగలు రాత్రి కాగాలేంది, స్త్రీలు పురుషులు కాగాలేనిది, పురుషులయిన మీరు గర్భము దాల్చటంతో వింతేముంది" అన్నాడు.

ఆ మాటలకు రాజు కళ్లు తెరిచి తన తెలివితక్కువతనాన్ని తానే దూషించుకుని ఆయా శాసనాలను ఉపసంహరించుకున్నాడు.

చూచారా! బాలలూ!! డాక్టరు ఎంత తెలివిగా మూర్ఖపురాజు శాసనాలను మార్చాడో!!

(504-వ పేజీ తరువాయి)

శాల నిర్వహిస్తున్న ఒక స్త్రీ దీనిని కని పెట్టింది.

నిచ్చెనలవలె ఉపయోగించడానికి వీలయిన సౌకర్యమయిన కొత్త పరికరాలు, విద్యుచ్ఛక్తి సహాయంతో ఇళ్లు తుడిచే "వేక్యూమ్ క్లీనర్"తో పాటు ఈగలని పట్టుకునే ఒక కొత్త పరికరం, మొదలయినవి ఎన్నో ప్రదర్శించారు.

నిద్రలో గుఱ్ఱు పట్టకుండా నిరోధించగల పరికరం ఒకటి చాలా చిత్రంగా కనపడింది. ఇటువంటి పరికరాలు సరదాకి కనిపెట్టిన వారికి వారి చివరరోజులలో సుఖంగా కాలంగడపడానికి వీలయినంత లాభంచేకూర్చగలదని నిపుణుల అభిప్రాయం. ఇటువంటి పరికరాలలో ఒకటి మొండిచేతులుగలవారు మొగంకడుగుకోడానికి ఉపయోగించే "టూత్ బ్రష్." మోటారు కార్లకి ఉన్నట్లు, మనుష్యుల కళ్లఅద్దాలు తుడవడానికి ఉపయోగించే పరికరం ఒకటి ఉంది. అనేకరకాల పళ్లకి తొక్కలు తీసే పరికరాలు అనేక ఇతర వింతలు ఈ ప్రదర్శనంలో ఉన్నాయి. క్రీడావినోదాలకోసం, కొత్త వస్తువులు సృష్టించాలని ఆవేశంతోనూ చేసే యీ పనులు కొంతకాలం తర్వాత నిస్సందేహంగా మానవాభ్యుదయానికి తోడ్పడ గలవు.

"ఇంట్రా"





(482వ-పేజీ తరువాయి)

చేసికొని మానవశ్రేయస్సుకు పునాదియైన సత్యమును, ప్రేమను, ధర్మమును ప్రబోధించారేకాని విభేధాలు పెంచుకొని గుద్దులాడమనియో, యుద్ధాలు చేయమనియో ప్రబోధించలేదు. అయితే వారివారి కాలాలలోని పరిస్థితుల దృష్ట్యా అధర్మాన్ని, అక్రమాన్ని నిర్మూలించడానికి అవసరమయితే పోరాటాలు జరిపి, ధర్మాన్ని, న్యాయాన్ని స్థాపించమని ప్రబోధించియుండవచ్చును. అందుకు ఆ మతకర్తల దృష్టి తమ పరిసరాలకే పరిమితమై యుండటం, బయటి ప్రపంచంగాని యితర మతబోధనల మంచిచెడ్డలుగాని తెలియకపోవడం అయియుండవచ్చును. అంతేకాని అధికార అధిపత్య వాంఛలను పెంచుకొని శాంతిభద్రతలకు ముప్పు తెమ్మనడం ముమ్మాటికి వారి ఉద్దేశం అయియుండదు. పేర్లు వేర్వేరైనా, ఆరాధనా పద్ధతులు వేర్వేరైనా ప్రపంచ గమన నిర్ణేతయైన భగవంతుడు ఒక్కడే యనునది అన్ని మతముల ఘోష. భగవంతుని దృష్టిలో మనమందరం సమానులం కాబట్టి మనమందరం సుఖసౌభాగ్యాలతో జీవయాత్ర సాగించాలనేది భగవంతుని యిచ్ఛ. దానికి సమరస సమైక్యతలు, మంచి చెడ్డలు, సత్య, ధర్మాల పరిజ్ఞానము అత్యవసరం. అప్పుడే త్యాగం, సేవాసక్తి అలవడుతవి. భగవంతుని యిచ్ఛను వ్యతిరేకించడం ఆత్మవిధ్వంసమునకు దారితీయును.

ఈనాటి కలుషిత వాతావరణములో ప్రజలు విభేధాలను విస్మరించి విశాల హృదయంతోను, దృక్పథంతోను మతబోధనల సారాంశాన్ని పారచూడాలి! అట్టి బోధనలను సయితం మన ప్రస్తుత దేశకాల పరిస్థితులకు సమన్వయపరచుకొని ఉమ్మడి శ్రేయస్సుకు పాటుపడాలి! ఎప్పటికప్పుడు ఏర్పడే అశాంతి, అరాజకాలకు తామే కారకులమని గుర్తించి, సన్మార్గాలకు మరలినచో శాంతి భద్రతలకు, సౌభాగ్యమునకు లోటుండదు.

కుల, మత, వర్గ విభేధాలను విస్మరించడమంటే ప్రజలు ఉమ్మడిగా మరింత సన్నిహితం కావడమన్నమాట. న్యాయానికి, ధర్మానికి, ప్రేమకు ప్రాధాన్యమిచ్చినచో సత్యజీవనము తనంతటదే అమరుతుంది. అట్టి జీవనంలో స్వార్థానికి, అధికార ఆధిపత్య వాంఛలకు అవకాశాలుండవు. అట్టి జీవనమే యీనాటి పతనావస్థనుండి ప్రపంచాన్ని ఉద్ధరించగలదు.



# ఆరోగ్య కేంద్రాలు



నేడు భారతదేశంలో అనారోగ్యం నిర్మూలించి, వ్యాధుల నరికట్టి జాతి ఆరోగ్యం పునరుద్ధరించడానికి అఖండమైన కృషి జరుగుతోంది. దీనికోసం ఎన్నో కొత్త ఆస్పత్రులు తెరవడం, ఆరోగ్య భీమా పథకాలు ప్రవేశపెట్టడం జరుగుతోంది. ఆరోగ్య కేంద్రాలు తెరుస్తున్నారు. ఇటువంటి ఆరోగ్య కార్యక్రమాలలో లోహపు జలాలున్నచోట్లు అభివృద్ధిపర్చవల్సిన ఆవశ్యకత కూడా ఎంతైనా ఉంది. లోహపు జలాలలో స్నానంచేసి, ఆ ప్రాంతాలలో కొంతకాలంపాటు ఉన్నట్టయితే చాలా వ్యాధులు కుదురుతాయి. మనదేశంలో ఇట్టి లోహపు జలాలు దొరికే స్థలాలు ఎన్నో వున్నాయి. వీటిని శాస్త్రీయమైన మార్గాలలో అభివృద్ధిపర్చి ఆరోగ్యకేంద్రాలుగా రూపొందించవల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

ఈ సందర్భంలో ఇతర దేశాలలో వీటిని ఎలా అభివృద్ధిపరుస్తున్నారో తెలుసుకోవడం ఆరోగ్య పథక కర్తలకి ఉపయుక్తంగా వుంటుంది.

పశ్చిమ జర్మన్ రాజధాని బాన్ నగరం దగ్గర రైన్‌నదిమీద "ఏడు కొండల" పాదచరియలలో జర్మన్ ప్రభుత్వం ఒక కొత్త ఆరోగ్యకేంద్రం నిర్మిస్తున్నారు. దీని భవన నిర్మాణం యించుమించు పూర్తి అయింది. భవనంచుట్టూ నేల చదును చేసి గడ్డి, మొక్కలు నాటుతున్నారు. పశ్చిమ జర్మనీలో లోహపు జలాలున్న ప్రదేశాల నభివృద్ధిపరిచే ప్రత్యేక సంస్థవారీ ఆరోగ్యకేంద్రాన్ని ఏర్పాటు చేస్తున్నారు. ఈ కేంద్రానికి రైను నదిలో వున్న గ్రేఫన్‌వెర్త్ దీవినుంచి లోహపు జలాలని స్నానపానాలకోసం ఏర్పాటుచేస్తున్నారు. ఈ లోహపు జలాలలో స్నానం చేయటంవల్ల, వాటిని త్రాగడం వల్ల చాలా వ్యాధులు కుదురుతాయి. ఇదికాక యంత్రసహాయంతో మర్దనాలు చేయడానికీ, యితర చికిత్సలకీ అవకాశాలు కల్గచేస్తున్నారు. వేసవి రోజులలో అక్కడికి వచ్చిన రోగులకి, వారి ఆరోగ్య పరిస్థితి ననుసరించి, రైనునదిలోని గ్రేఫెన్‌వర్తు దీవిలో ఏర్పాటుచేసిన లోహపునీటి సరస్సులో ఈదే సౌకర్యాలు కల్గచేస్తున్నారు. ప్రస్తుతానికి దేశంలోని ఆరోగ్య భీమాపథకం క్రింద డాక్టర్లు పంపిన రోగులకే ఈ ఆరోగ్యకేంద్రంలో ఉండడానికి వీలుంటుంది.

ఇదికాక హేనెఫ్ ప్రాంతంలో వున్న లోహపు నీటి జలాలని ఈ శతాబ్దారంభంలో త్రవ్వడం జరిగింది. దేశదేశాలనుంచి ఎందరో ప్రజలు అక్కడికి వచ్చి విశ్రాంతి తీసుకుని ఆరోగ్యం కోలుకునేవారు. దీనిని ఆరోగ్యకేంద్రంగా రూపొందించడానికి జరిగిన ఏర్పాట్లు మొదటి ప్రపంచ సంగ్రామంవల్ల నిలిచి పోయాయి. కాని మొదటి యుద్ధానికీ, రెండవ యుద్ధానికీ మధ్యకాలంలో, అక్కడి లోహపు జలాలని పెద్ద ధారగా పైకి తీసుకురావడంకోసం ఒక "పంపింగ్" యంత్రం ఏర్పాటుచేసి, అక్కడ ఒక తోట ఏర్పాటుచేశారు. కాని రెండవ ప్రపంచ సంగ్రామ ఫలితంగా యీ కార్యక్రమాలకి నిరోధం కల్గింది. కాని ఎంతో కాలం పాటు హేనెఫ్ జలాల వల్ల లాభం పొందినవారు, ఆ జలాలలో స్నానంవల్ల గుండెవ్యాధులు, రక్తప్రసార నిరోధాలు, అజీర్ణ వ్యాధులు నిర్మూలం కాగలవని నిరూపించారు. ఈ హేనెఫ్ కేంద్రంలో ఒక వెయ్యిమంది ప్రజలు ఉండడానికి వీలయిన హోటల్లు, బోర్డింగ్ భవనాలు ఉన్నాయి. క్రీడా కార్యక్రమాలకి అవకాశాలు, విశ్రాంతికి మైదానాలు, నిపుణులైన వైద్యులు, ప్రతిరోజూ చాలాసేపు సంగీతం వినిపించడంకోసం ఒక వాద్యబృందం మొదలయిన సౌకర్యాలున్నాయి. ఇవన్నీ సరిగా పనిచేస్తున్నదీ లేనిదీ, ప్రభుత్వాధికారులు పరీక్షిస్తారు. మురికినీటి పారుదలకి అవకాశాలు ఏర్పాటు చేయడంచేతనూ ఆ ప్రాంతాలలో పొగ, ధూళి, కలగచేసే పారిశ్రామిక సంస్థలకి లైసెన్సులు లేకపోవడంచేతనూ, జర్మన్ ప్రభుత్వం హేనెఫ్ ఆరోగ్య కేంద్రాన్ని ఒక ప్రధాన ఆరోగ్య కేంద్రంగా గుర్తించింది. దీనిని పశ్చిమ జర్మనీలోని 140 వ లోహపు జలారోగ్య కేంద్రంగా గుర్తించారు.

యుద్ధానంతరం పశ్చిమ జర్మనీలో లోహపు జలాలున్న కేంద్రాలని ఎంత శ్రద్ధతో అభివృద్ధి పరుస్తున్నారో తెల్సుకోడానికి ఈ హేనెఫ్ కేంద్రం అభివృద్ధి ఒక చక్కని ఉదాహరణ. గత శతాబ్దంలో

యీ ప్రాంతానికి ప్రజలు విశ్రాంతికోసం వెళ్లేవారు. నేడు ఆరోగ్యం కోలుకోడానికీ, అంగవైకల్యం కల వుండా శక్తి సామర్థ్యాలు పునరుద్ధరించుకోడానికీ అవసరమయిన రోగులు మాత్రమే అక్కడికి వెడుతున్నారు. దేశంలో, సాంఘిక భీమాసంస్థలు ఆరోగ్య అవసరాలకోసం పంపేవ్యక్తులు మాత్రమే యిప్పుడు యీ కేంద్రాలకి వెడుతున్నారు. ఆ సంస్థలకి చెందిన వైద్యులు రోగులని పరీక్షించి వారు ఏ కేంద్రానికి వెడితే లాభదాయకంగా వుంటుందో సూచిస్తారు.

మొత్తం పశ్చిమ జర్మనీలో ఇలాటి కేంద్రాలు రెండు వందలకి పైగా వున్నాయి. నిరుడు 23 లక్షల మంది యీ కేంద్రాలని సందర్శించారు. గడచిన అయిదు సంవత్సరాలలోనూ ఈ కేంద్రానికి వెళ్ళే వారి సంఖ్య నూటికి అయిదు వంతుల వరకూ పెరిగింది. 1959వ సంవత్సరంలో పశ్చిమ జర్మనీలోని ఆరోగ్య కేంద్రాలకి విదేశాలనుంచి లక్షా 14 వేల మంది వచ్చారు. వీరిలో చాలామంది ప్రత్యేకం లోహపు జలాల వైద్యంకోసంకాక, అనుకూల వాతావరణ పరిస్థితులుగల ఆరోగ్య కేంద్రాలు సందర్శించారు. చాలామంది దేశం పర్యటిస్తూ ఈ కేంద్రాలు కూడా చూడడానికి వచ్చినవారు.

ఇంజక్షన్లు, మందులు పుచ్చుకోవడంవల్ల వ్యాధి ఉధృతం తగ్గి, తాత్కాలిక నివారణ లభించవచ్చు. కాని ఈ లోహపు జలాలలో స్నానంచేసి, వాటిని త్రాగడంవల్ల చాలా వ్యాధులకి పూర్తి నివారణ కల్గుతుంది. అంతేకాక రోగుల నరాలకి పుష్టి,మానసిక సంతుష్టి కూడా లభిస్తాయి.

—"ఇంట్రా"

# చిత్ర సమీక్ష

## అభిమానం

శ్రీ ప్రొడక్షన్స్‌వారి చిత్రం 'అభిమానం' రెండు నెలలలో నిర్మాణమయి విడుదలయింది. ఇందులో దైనందిన సంఘటనలు, సన్నివేశాలు చిత్రించబడి స్త్రీలూ, పురుషులూ కూడ ఆత్మపరిశీలన చేసికోడానికి అవకాశమిస్తుంది యీ చిత్రం. ముఖ్యంగా విద్యావతులైన అనేకమంది మహిళల మనస్తత్వాలు, పోకడలు, దానియొక్క ఫలితాలు, పరిణామాలు ఎలా గుంటవనేది యీ చిత్రంలో చూపబడింది. అంటే మహిళ విద్యావిధానంలో ఉపయుక్తమయిన మార్పులు రావాలని యీ చిత్రం ఎత్తిచూపుతుంది. సావిత్రి, నాగేశ్వరరావు నాయకీనాయకులుగా నటించారు. కన్నాంబ మాతృదేవిపాత్ర సహజంగా నిర్వహించింది. లక్షలార్జిస్తున్న సంపన్నుల నేకుల మనస్తత్వాలుకూడ యిందులో యిమడ్చబడినవి. కృష్ణకుమారి నిర్వహించిన భూమిక చిన్నదైనా ప్రశంసనీయంగా నుండింది.

సంభాషణల స్థాయి ఒడిదుడుకలతో అక్కడక్కడ లోకభూయిష్టంగా తోచింది. కథాగమన మయినా సహజత్వాన్ని కొన్నిచోట్ల కోల్పోయింది. సంగీతం ఒక మోస్తరుగా నుండింది. మొత్తంమీద శ్రీ సి. యస్. రావుగారి దర్శకత్వం బహు కొద్ది కాలంలో నిర్మించిన యీ చిత్రం ప్రజల మన్ననల నందుకొంటున్నదని వార్తలు వింటున్నాము.

## జల్సారాయుడు

హైదరాబాద్ మూవీస్‌వారు 'జల్సారాయుడు' చిత్రాన్ని యావదాంధ్ర దేశంలో విడుదలచేశారు. హిందీ చిత్రం 'జాల్సాజ్' చిత్రానికి అనువాద మయినా చక్కగాను, ఆకర్షణీయంగాను రూపొందింది. శ్రీ తాపీ చాణక్య దర్శకత్వము మరింత రాణింపుకు వచ్చింది. కథాగమనం, సన్నివేశాలు, సంఘటనలు సయితము వీలైనంతవరకు హిందీ చిత్రాన్ని అనుసరించినవి. జగ్గయ్య, జమున జంట చాల బాగుంది. కన్నాంబ నటనాకౌశలం ఉత్తమస్థాయి నందుకున్నది. గుమ్మడి, ముక్కామల సహజంగా నటించారు. ఫొటోగ్రఫీ, మాటలు, పాటలు, సంగీతము, నృత్యము తగినట్లు ఒప్పి చిత్రాన్ని మనోరంజకంగా రూపొందించినవి. 'జల్సారాయుడు' ఉత్తమచిత్రంగా ఘనమైన కీర్తిప్రతిష్టలతో ప్రజాదరణకు పాత్రము కాగలదని చెప్పవచ్చును.

— పున్నయ్య

## రమాసుందరి

మహేశ్వరి ప్రొడక్షన్స్‌వారి "రమాసుందరి" సామాన్య తారాగణంతో తీయబడిన రసవత్తర జానపదచిత్రము. ఇందు కథావస్తువు ఇద్దరు సఖుల మధ్య కలహగాధ. శివభక్తురాలైన సామాన్య భూలోక కన్య రమ తన పాతివ్రత్యాన్ని రక్షించమంటూ పరమశివుని ప్రార్థించి, ఒక రాక్షసత్వము గల యక్షకన్యను తన పతిభక్తి మహిమతో కండ్లు తెరిపించుట, పతిభక్తియొక్క మహిమను చాటుట కథాంశము.

భూలోక కన్య రమాసుందరిగా (కృష్ణకుమారి) యక్షకన్య విందగా (గిరిజ) సన్నిహిత సఖులౌతారు. వివాహము వారియొక్క స్నేహమునకు అడ్డుగా నిలచి త్రుంచివేస్తుందనే వూహతో ఈ ప్రాణ సఖులు అయిష్టపడి పెండ్లి చేసుకోకూడదని ప్రతిజ్ఞ చేసుకుంటారు. ఈ ప్రతిజ్ఞ కొంతకాలంగా వేచియున్న (విందయొక్క) మణిభద్రుడు (కాంతారావు)కు శాపమౌతుంది. కలలో రమను ప్రేమించిన విజయశీలుణ్ణి (రామకృష్ణ) రమవద్దకు పంపి, మాయతో వారిని విడని జంట చేస్తాడు మణిభద్రుడు. ఆ విధంగా అయినా విందె ఒంటరి అయి తన కోర్కెను నెరవేరుస్తుందని మణిభద్రుని ఆశ. కానీ తన ఆశ నిరాశ అవుతుంది. రమపై వింద కినుక పూనుతుంది. విజయశీలునికి మతిభ్రమణం కల్గిస్తుంది. వారి గాంధర్వ వివాహాన్ని దుఃఖప్రదాయకం చేస్తుంది. విడగొట్టుంది. ఈ ఫక్కీలో తీసిన ఈ జానపద చిత్రమందు కృష్ణకుమారి, గిరిజ కడుసమర్థంగా నటించారు. కాంతారావు బాలకృష్ణ, మీనాకుమారి బాగానే నటించారు. ముఖ్యంగా మాయా విజయశీలునిగా మాత్రం రామకృష్ణ చాలా బాగా ఒప్పించాడు.

హన్సూరి కృష్ణమూర్తిగారి దర్శకత్వం; శ్రీ సుసర్ల దక్షిణామూర్తిగారి సంగీతం; శ్రీ మద్దిపట్ల సూరిగారి సంభాషణలు; శ్రీ శ్రీ, ఆరుద్ర, వడ్డాది, రాజశ్రీ పాటలు; వేణు ఛాయాగ్రహణం ఉత్సాహపూరితంగా నున్నాయి. యీ మధ్యన వెలువడిన జానపద చిత్రాలలో మేలైనదని చెప్పవచ్చును. యీ చిత్రం ప్రజలను అన్నివిధాలా ఆకర్షించగలదు.

— యం. సుశీల




శ్రీ వెంకటేశ్వర నీరాజనము : శ్రీ కోట సోదరకవులు. ప్రచురణకర్తలు - కవిచంద్ర గ్రంథమాల, 147, మింటుస్ట్రీటు, మద్రాసు-1. వెల 50 న. పైసలు.

శ్రీ తిరుపతి వెంకటేశ్వర స్వామిని స్మరించి, కీర్తించుటకని రచించిన చిన్న పుస్తకము. ఇందలి పద్యములు భక్తిభావభరితములై సరళమైన ధోరణిలో నున్నవి. నిరంతరము భక్తులను అనుగ్రహకటాక్షములతో కాపాడుచున్న శ్రీ వేంకటరమణుని కీర్తించి, గానము చేయుటకు యీ పుస్తకం వినియోగ పడనుండటం ఆనందించతగిన విషయము.

హరినామమహిమ: కూర్పరులు - శ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామి. ప్రకాశకులు : సాధనగ్రంథమండలి, తెనాలి, గుంటూరు జిల్లా. వెల 25 న. పై. లు

శ్రీ పోతన రచించిన భాగవతమందలి హరినామ మహిమను వివరించుపద్యములు ప్రథమస్కందము నుండి ద్వాదశస్కందము వరకుగలవి సేకరించబడి కూర్చబడిన దీపుస్తకము. పరమ భాగవతోత్తముడు, కవియైన శ్రీ పోతన నిష్కామిగా పరమాత్మకంకితమైనవాడై చెప్పిన పద్యములగుటచే భగవన్నామము విలువ తెలిసికొని ఆరాధించి, సేవించుటకివి తప్పక తోడ్పడునవి. ఈ సేకరణ అత్యంతోపయుక్తమయినది.

మన జాతీయపునర్నిర్మాణము-విద్యార్థుల కర్తవ్యము : ఆచార్య శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య. తెలుగు విద్యార్థి ప్రచురణలు, మచిలీపట్టణము, కృష్ణాజిల్లా, వెల 60 న. పై. లు.

ఇందలి శీర్షికలను గ్రంథకర్త అపార అనుభవ, పాండిత్యములతో నిర్వహించిరి. జాతీయ పునర్నిర్మాణమునుగురించి కృషి, చర్చలు జరుగుతున్న యీ రోజులలో విద్యార్థుల పాత్రఎట్టిదియనీ, వారికర్తవ్యాన్ని ప్రబోధిస్తున్న యీ పుస్తకంలో అనేక ప్రధాన సమస్యలు చర్చించడముతోబాటు అమూల్యమైన సలహాలు, సూచనలు యివ్వబడినవి. జాతీయ అభివృద్ధి అభ్యుదయాలపట్ల ఆసక్తిగల విద్యార్థులు తప్పక చదువతగిన పుస్తకము.

వీరజగ్గడు (వెండి తెరనవల): సంకలనం శ్రీ గోకేటి శ్రీరామారావు. ప్రకాశకులు. శ్రీ తిరు వెంకటప్రచురణ, 2/20 రంగనాథన్ స్ట్రీటు, టి. నగర్, మద్రాసు 17. వెల 50 న. పై. లు

ఈ మధ్యనే విడుదలయిన శ్రీ కృష్ణసాయి ఫిలింస్ వారి అనువాదచిత్రం 'వీరజగ్గడు' వెండితెరనవల. ఇట్టివి యీమధ్య వెలువడడం సాధారణమయింది. కథాగమనం, పొందిక ఒక మోస్తరుగానున్నవి. ఆరుద్ర గారి పాటలు, మాటలు చిత్రానికే కాక యీనవలనుకూడ రాణింపజేసినవి, కథాసాహిత్యంపట్ల ఆసక్తి చూపుతున్న పాఠకలోకం యీ పుస్తకమును అభిమానించవచ్చును.

— —

# సంపాదకీయములు

## పొదుపరితనాన్ని వృద్ధిచేసేందుకు మార్గాలు

జాతీయ పొదుపు ఉద్యమ కేంద్ర సలహా సంఘమును కేంద్ర ఆర్థిక శాఖ ఉపమంత్రి శ్రీమతి తారకేశ్వరి సిన్హా ప్రజలలో పొదుపరితనాన్ని కలుగజేసే మార్గాలను కల్గించవలసినదని కోరారు.

ప్రజల స్వీయశ్రేయస్సు దృష్ట్యాను, జాతీయ అభివృద్ధి ప్రణాళికల నిర్వహణ దృష్ట్యాను పొదుపరితనం తప్పకుండా అవసరం. గ్రామాలలో డబ్బు విలువను గుర్తించకుండా దుబారా చేసేవారనేకులు కలరు. ఒక వేళ తమ ఆర్జనలో పొదుపరితనం వలన మిగుల్చుకో కలిగినా భద్రంగా దాచుకోడానికో, పెట్టుబడి పెట్టి సద్వినియోగం చేయడానికో తెలియనివారూ యున్నారు. పొదుపరితనంవలన తాము ప్రకాశవంతమైన భవిష్యత్తును రూపొందించుకోడమే కాక తమ డబ్బుకు భద్రత ఏర్పడి, జాతీయ ప్రణాళికల నిర్వహణకు తోడ్పడటం వాంఛనీయము. దీనివలన స్వంత ప్రయోజనాలతో బాటు జాతీయ ప్రయోజనాలు కూడ ఫలప్రదము కాగలవు. పొదుపరితనం అవకాశమున్న ప్రతియొక్కరు గ్రామాలలోను, పట్టణాలలోను అలవరచుకోవాలి! పొదుపరితనమును ప్రోత్సహించి వారి మొత్తాలకు భద్రతను కూర్చే విషయంలో వసతులు, అవకాశాలు ప్రభుత్వం విస్తృతం చేయాలి!

---

## గృహప్రవేశాలు

కేసరి హైస్కూలు (త్యాగరాయనగర్) ఆవరణలో శ్రీ గోగినేని చిన్న వెంకటేశ్వరరావు నిర్మింపజేసిన 'గోగినేని పెదవెంకటేశ్వరరావు స్మారకభవనం', శ్రీ యార్లగడ్డ వెంకన్నచౌదరిగారి విరాళముతో నిర్మాణమయిన 'చేతివృత్తుల శిక్షణా భవనం' గృహప్రవేశమును ఆంధ్రప్రదేశ్ దేవాదాయమంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు అక్టోబరు 3న జరిపారు. ఏర్పాటైన సమావేశంలో కేసరి విద్యాసంస్థ కార్యదర్శి దివాన్‌బహదూర్ బండి శ్రీహరిరావు నాయుడుగారు స్వాగతం చెప్పుచూ కేసరి విద్యాలయముల అభివృద్ధిని, దానికి తోడ్పడిన దాతలను, విరాళములను వివరించారు.

శ్రీ చంద్రమౌళిగారు మాట్లాడుతూ విద్యాలయముల అభివృద్ధి చాల సంతోషమును కలిగించుచున్నదనియు, ఈ సందర్భమున శ్రీ శ్రీహరిరావు నాయుడుగారి కృషి, సేవ ప్రశంసనీయములని, విద్యాలయముల అభివృద్ధి భవనాల నిర్మాణంమీద నాధారపడరాదనియు, ఉపయుక్తమైన విద్యావిజ్ఞానములు గరపడంమీద నాధారపడుననియు, అట్టి విద్యావిజ్ఞానములు సమకూర్చుటకు యీనాటి విద్యావిధానము అనువైనది కాదనియు, అందుకనే విద్యావిధానము సంస్కరించబడాలని అనేకులు అంటున్నారన్నారు. శ్రీ గోగినేని చిన్న వెంకటేశ్వరరావు, యార్లగడ్డ వెంకన్నచౌదరిగార్లు కూడ ఉపన్యసించారు.

సమావేశం తర్వాత నృత్యాచార్యుడు శ్రీ శైవాగారి అధ్వర్యమున బాలల నృత్యప్రదర్శనములు జరిగినవి. ప్రధానోపాధ్యాయుడు శ్రీ తిరుమలాచారి వందనసమర్పణం చేశారు.

## పూర్ణతిలకం

సుప్రసిద్ధ సంఘసేవిక, సంస్కర్త, దేశభక్తురాలు, కవయిత్రి శ్రీమతి యామినీ పూర్ణతిలకమ్మ స్మృతి చిహ్నంగా ఆమె కుమార్తె శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్ నిర్మింపజేసిన చిన్న భవనం 'పూర్ణతిలకం' ప్రవేశం యీనెల 9వ తేది తాంబరంలో జరిగింది. మద్రాస్ సంగీత కళాశాల ప్రిన్సిపాల్స్ శ్రీ పార్థసారధి దంపతులు, వారి విద్యార్థినులు పాటకచ్చేరి చేశారు. అనేకమంది పెద్దలు, ప్రముఖులు ఉత్సవంలో పాల్గొని ఆదరసత్కారాలు పొందారు.

---

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

